# అంకితం

నీచాలమ్మ సేభావనతో బాధపడే హృదయాలకు.

# వైకుంఠపాళీ

ఆ రోజుల్లో సికింద్రాబాదుమహానగరంలో కనకాంగికి వచ్చినంత పేరుప్రతిష్ఠలు మరే సానికీ లేవనడంలో యేమాత్రం అతిశయోక్తి వుండదు. పెళ్ళిళ్ళలో, గుళ్ళలో కాళ్ళకుగజ్జె కట్టి పదిమందినీ రంజింపచేయకపోయినా, ఆమె పేరు అబాల గోపాలము చెప్పుకుంటూనేవుంటారు. ఆడవాళ్ళకూ అదే ముచ్చట. "దానిపోకు చూడు కనకాంగిలాగా" అనీ, "మా అమ్మాయి కనకాంగిలాగా కళ్ళుతిప్పుతుందండీ" అనీ ఆడవాళ్ళు తమ ఆడపిల్లలనుగూర్చి చెప్పుకోవడమూ కద్దు. ఇక విటాగ్రేసరులసంగతి వేరే చెప్పనక్కరలేదు; ఒక్కసారైనా ఆమెపొందు అనుభవిస్తేగాని తమ రసికత్వం పరిపూర్ణత్వం చెందదని భావిస్తూంటారు.

కనకాంగిది నిజంగా బంగారుమేడ కట్టవలసినజాతకం. బంగారుమేడ కట్టాలనే ఆమెవుద్దేశంకూడా. ఆమెముఖంలో వొకవిధమైన లావణ్యం వుంది ఆ తళుకు యెన్నటికీ మాసిపోదా అనిపిస్తుంది. ఆ లావణ్యమే కనకాంగికి ముప్పైయెనిమిదేళ్ళకుపైబడ్డా పదహారేళ్ళయువతిలా అనిపింపజేస్తుంది ఈ వృద్ధయువతీత్వప్రాప్తి బహుజనదుర్లభమైన సిద్ధి. పురాకృత పుణ్యవిశేషమని వేరే చెప్పనక్కరలేదు. అందం లేకపోయినా

పైపూతలతో, మెరుగులతో నలుగురి దృష్టులూ ఆకర్షించే జాతిలో పుట్టినదానికి యీ సిద్ధి వరప్రసాదం కదా!

కాని, పట్టణంలోని విటులందరూ కనకాంగిని యెరిగి వున్నవారే. కనకాంగి వయసుమళ్ళినదవుతూండటంవల్ల ఆమె పొందు నాసించడం క్రమంగా మానుకుంటున్నారు. గాజు బొమ్మలాంటి ఆమె శరీరంగాని, వాలుజడలూ, పొట్టిరవికలూ, తళుకు బెళుకులుగానీ విటులను ఆకర్షించడంలో యేమీ పని చేయడంలేదు మరీ కొత్తవాళ్ళనుతప్ప ఆమె యెవరినీ బోల్తా కొట్టించలేకపోతోంది. క్రమంగా గిరాకీ పడిపోయింది.

బంగారు మేడ కట్టాలన్న ఆమెఆశలన్నీ నిరాశలైనవి. లక్షలుగాకపోయినా కొన్నివేలైనా వెనక వెయ్యాలనుకున్న దానికి రోజులుగడవడమే బ్రహ్మాండమైపోతోంది. తాను యింతవరకు సంపాదించినదికూడా యేమంత నిలవలేదు. తాను వొక సంవత్సరంపాటు వొక కోమటిషావుకారుతో వున్నందుకు అతడు రాసియిచ్చిన మేడ (ఇప్పుడు తానువుంటున్నది), అయిదు వేలరొక్కమూ తప్ప. ఆమెదగ్గర యేమీలేదు. కూర్చుని తింటూవుంటే, కుబేరునిసిరిఅయినా కొన్నాళ్ళకు తరిగిపోతుంది. మరి ఈ అయిదు వేలు యెంతకాలం?

ఇంక ఆమెకు గత్యంతరంలేదు. నిజానికి సానివృత్తికి అలవాటుపడిపోయినదానికి మరొకవృత్తి చేతగాదు. పైగా మనస్కరించదు. మనస్కరించినా సాగదు.

మరి పొట్టగడవడం ఎట్లా? ఇక ఆమె ఆశలన్నీ తన ఏకైకపుత్రిక పంకజమీాదనే.

పంకజానికిప్పుడు పదహారేళ్లు. స్కూలుఫైనల్ చదువు

తోంది. దబ్బపండు ఛాయ, అందమైనముఖం, విశాలమైన కళ్ళు. కనకాంగినిమించిన అందాలరాశి.

పంకజ ఆమెకు తెనాలిలోవుండగా పుట్టింది. పంకజ నాలుగేళ్ళపిల్లగా వున్నప్పుడు కనకాంగి వొక నాటకకంపెనీ మేనేజరుతో సికింద్రాబాదుకు వచ్చింది. నాటినుంచి సికింద్రాబాదే స్వస్థానమైంది కనకాంగికి. పంకజ పెద్దదై చేతికి అంది వస్తే నిజంగా కోట్లుసంపాదించవచ్చని కలలుగన్నది కనకాంగి. కాని, ఆమెచేసిందల్లా వొక్కటే పెద్దపొరపాటు. అది పంకజాన్ని చిన్నప్పటినుండీ స్కూలుకిపంపడం. చిన్నపిల్ల ఇంట్లో వుండి చేసేదేముందిగనుక. నలుగురితోబాటు చదువుకుంటుంది అన్న వుద్దేశంతోనే అయిదేళ్లూ నిండగానే పంకజాన్ని బడిలో చేర్పించింది.

ఒక్కొక్కక్లాసే పైకివెడుతూంటే పంకజానికి చదువు మీద ఆసక్తి యెక్కువైంది. ప్రాయంతోపాటే తెలివితేటలు కూడా క్రమంగా వృద్ధిచెందింది, లోకంలోని మంచిచెడ్డలను గ్రహించగలుగుతోంది. పంకజ రజస్వలకాగానే స్కూలు మాన్పించాలని చూసింది కనకాంగి. కాని, చదువుమీద ఆసక్తితో పంకజ కళ్ళనీళ్లుపెట్టుకుంది. యెంతచెడ్డా కనకాంగిది కన్నకడుపు కావడంచేత పంకజచదువుకు భంగంవాటిల్లలేదు. ఆమె తప్పకుండా ప్యాసవుతూ స్కూలుఫైనల్వరకు వచ్చింది.

వికసించిన పంకజసౌందర్యం అందర్నీ ఆకర్షిస్తోంది. ఆమె కన్నెరికపుబేరం వేలకు వెళ్ళినా, పంకజను లొంగదీయడం కనకాంగికి అసాధ్యమౌతోంది. లోకంలో ఇది నీతి, ఇది అవి నీతి అని తెలుసుకున్న పంకజ తల్లి కెలా లొంగుతుంది? కన

కాంగికి తనకూతుర్ని బలాత్కరించడం యిష్టంలేదు. నయాన, భయాన యెంతో చెప్పిచూసింది. కాని ససేమి పంకజ తల్లికి లొంగలేదు. వృత్తిమాట యెత్తగానే త్రాచుపాములా తల్లి మీదికి లేచేది. అంతేకాదు, తల్లినికూడా యిటువంటి నీచపు పని చేయవద్దని శాసించేటంత ధైర్యం కలిగిం దామెకు.

ఇక గత్యంతరంలేక పంకజకు తెలియకుండా ఆమె గది లోకి యెవరినైనా వదిలిపెడితే అంతా చక్కబడుతుందని కనకాంగి నిశ్చయించుకున్నది.

పంకజకు స్కూల్ ఫైనల్ పరీక్షలు దగ్గరకువచ్చినై. ఇంకో పది హేనురోజులున్నై. పరీక్షకుముందు చదువుకోడాని కోసం ఆనాటినుండి పది హేనురోజులు శలవులిచ్చారు పంకజ యిదివరకే పాఠాలన్నీ బాగా చదివినా, మళ్ళీ వొకసారి గట్టిగా రివైజుచేయాలని ఆరాత్రి పెందలకడనే భోంచేసి, చదవ డానికి కూర్చుంది. కెమిస్ట్రీపుస్తకం తీసి చదవడం మొదలు పెట్టింది. టేబులుముందు కూర్చుని, వొకసారి పుస్తకమంతా చదివి, తలయెత్తి టేబులుమీది గడియారంవంక చూచేటప్పటికి అప్పుడే పదకొండైంది. అయినంతవరకుచదువుదామని మరో పుస్తకం తీయబోతుంటే యెవరో వెనుకనుండి పొడిదగ్గు దగ్గి నట్లై వెనక్కితిరిగి చూచింది. యెవరో అపరిచితవ్యక్తి. వయసు ముప్ఫైలోపుగానే వుండొచ్చు. తనమంచంమీద కూర్చుని వున్నాడు. తాను యింతసేపు గమనించనేలేదు. యెగదువ్వుడు క్రాపు, మల్లులాల్చీ, దోవతీ ధరించి, సిగరెట్టుపొగ వింతగా వదులుతూ తనను పరీక్షగా చూస్తూ కూర్చున్నాడు.

“నేను యెనిమిదిగంటలనుండి యిక్కడే కూర్చుని

చూస్తున్నాను, నీవు నావంకచూస్తావేమోనని" అన్నాడు నవ్వుతూ.

పంకజ విస్తుపోయింది. అత డెలా వచ్చాడాఅని ఆలోచించింది. క్షణంలో కనకాంగివన్నాగం అర్థమైంది. ఆమె మొదట కాస్త భయపడింది. కాని, ధైర్యంచిక్కబట్టుకుంది. అతనివంక నిశ్చలంగా చూస్తూ "నాకోసం వచ్చారా? మీ రెవరు? యెందుకు వచ్చా రిక్కడికి?" అంది నిదానంగా.

అతడు కొంచెం పెద్దగా నవ్వాడు. లేచి పంకజను సమీపిస్తూ "బలే! సాని అనవలసినమాటేనా? సాని యింటికి అందరూ యెందుకువస్తారు?" అన్నాడు, పంకజకేసి అదోరక మాదిరిగా చూస్తూ. పంకజ యేమీ మాట్లాడలేదు. లేచి టేబులుకానుకుని నిలబడింది.

"మీ అమ్మ నీ అందాన్నిగురించి అబద్ధంచెబుతోం దనుకుని ఆమెఅడిగినడబ్బులో సగమే యిచ్చాను. ఆమెవర్ణన కంటె ఎన్నోరెట్లు అందంగా వున్నావు. ఇదిగో తక్కినడబ్బు" అంటూ జేబులోంచి వొక నోట్లకట్ట తీసి టేబులుమీద పెట్టాడు.

పంకజకు యేంజవాబుచెప్పాలో తోచలేదు. అతనివంక నిశ్చలంగా చూస్తూ వుండిపోయింది. అతనిచూపులో కామం ప్రతిబింబిస్తోంది.

"నాతో మావూరు వచ్చేస్తావా? నాకు బోలెడంత డబ్బుంది. నాకు మంచిమంచి చీరలూ, నగలూ, కారూ..." అని యింకా యేమిటో అంటున్నా డతడు.

పంకజకు అతనిమాటలు వింటూంటే నవ్వువచ్చింది.

ఇంతవరకు యేపురుషుడూ తనయెదుట యీవిధంగా మాట్లాడ లేదు. నిజంగా కామం యెన్ని వెర్రికూతలు కూయిస్తుంది!

"దయచేసి ఇంక మీరు ఇక్కడినుండి వెళ్ళిపోండి. నేను చదువుకునేపిల్లను." అంది తొణకకుండా.

అతడు కాస్త విస్తుపోయాడు. "ఈ డబ్బు చాలదంటే చెప్పు" అని మరొకకట్ట జేబులోంచి తీసి ఆమెముందు పెట్టాడు. అతడు మరీ దగ్గరికి వస్తూండటం గమనించి పంకజ కాస్త పక్కకు తప్పుకున్నది.

"సానికిచ్చినడబ్బూ, గోడకు వేసినసున్నం . తిరిగిరాదు. మా అమ్మ కిచ్చినడబ్బు యెల్లాగూ మీకు తిరిగిరాదు. ఈ డబ్బుకూడా యెందుకు పోగొట్టుకుంటారు? నేను సానిని కాదు, వెళ్ళిపోండి" అన్నది.

ఈసారి అతడు విరగబడి నవ్వాడు.

"సానిదానికూతురు సానికాదా!" అన్నాడు ఆశ్చర్యంతో.

"కాదు. ఆ వృత్తిఅవలంబిస్తేనే సానిఅవుతుంది. మీరు డాక్టరుకొడుకును డాక్టరనగలరా? మీరెవరో? మిమ్మల్ని చూస్తే నాకు జాలివేస్తోంది. ఇంతడబ్బు యెందుకు వృథాగా తగలేస్తున్నారు? సద్వినియోగంచేయండి దీన్ని" అంది.

అతడు పంకజవంక రెప్పవాల్చకుండా చూస్తూ "నిన్ను చూచాక యే నాసిరకంగానికో పోకుండా, నా డబ్బు సద్వినియోగమే అవుతోందనుకున్నాను. మరి నీ వెందుకూ యింత సౌందర్యాన్ని వృథాచేసుకుంటున్నావు? దాన్ని సద్వినియోగం చేయరాదా?" అన్నాడు.

"నేను పడుపువృత్తి అవలంబించడంలేదని మీకు ముందుగానే చెప్పాను. మీరు దయచేసి యిక్కడనుండి వెళ్ళండి. నాచదువుకు భంగంకలిగించకండి" అంది పంకజ.

అతడు వొక్కక్షణం ఆలోచించాడు. అతనిలో కామోద్రేకం యింకా తగ్గలేదు.

"నా కింకా పెళ్ళికాలేదు. మనిద్దరం పెళ్ళిచేసుకుని హాయిగా వుందాం. నీకు ఇష్టమైతే..." అన్నాడు.

"నా పెళ్ళినిగురించిగాని, నా భావినిగురించిగాని నా బుద్ధిని అవధానంచేసేస్థితిలో లేను నే నిప్పుడు. నా చదువు పూర్తిఅయ్యేవరకు నేను ఆ విషయాలు ఆలోచించలేను. దయచేసి నన్ను విడిచిపెట్టండి, మిమ్మల్ని బతిమాలుకుంటాను" అన్నది పంకజ.

అతనికామోద్రేకం క్రమంగా చల్లబడుతూవచ్చింది ఆమెధోరణితో.

"చదువా? ప్రస్తుతం యేంచదువుతున్నావు? ఇంకా యెంతవరకు చదువుతావు? తరువాత యేంజేస్తావు?" అన్నాడు.

"ఇప్పుడు స్కూల్ఫైనలే. ఇంకా పదిహేనురోజులుంది పరీక్ష. పరిస్థితులూ, దైవమూ అనుకూలిస్తే, డాక్టరును కావాలని వుంది. మీలాంటివారిశరీరాలను పాడుచేసేప్రవృత్తిని అవలంబించేకన్నా, బాగుచేసేవృత్తికోసం ప్రయత్నించడం తప్పా?" అంది అతనివంక తేరిచూస్తూ.

"నావెంట వచ్చెయ్యి. నేను నీ కోరికతీరుస్తాను" అన్నాడు మళ్ళీ కొంతఆశతో పంకజవంక చూస్తూ.

"ఇక్కడ నా కోరిక తీరదు అన్న నిరాశ నా కింకా కలుగలేదు. ఇంతవరకు నాచదువుకు భంగంలేదు".

"ఇక్కడవుంటే మీఅమ్మ నిన్ను పాడుచేస్తుంది" అన్నాడు మళ్ళీ.

"నా కేం భయంలేదు. నాకు మనోధైర్యం వున్నంత వరకూ నన్నెవరూ పాడుచేయలేరు" అంది పంకజ.

అతడు యేమనుకున్నాడో యేమో చప్పున వెనుదిరిగి వెళ్ళిపోబోయాడు. గదితలుపులు తెరచుకుని బయటకు వచ్చాడు. అతను టేబులుమీద వదిలేసిన నోట్లను చేతితో పట్టుకుని గదిద్వారందాకా వచ్చింది పంకజ.

"ఇవిగోనండి మీ నోట్లు; వీటినిక్కడే విడిచి వెళుతున్నారు" అంది.

అతడు పంకజవంక కాస్త నిదానించి చూశాడు. మళ్ళీ మనసులో యేం తోచిందో యేమో, ఆమెచేతిలోవున్న నోట్లను అందుకుని జేబులోపెట్టుకున్నాడు. ఈ దృశ్యాన్ని లోపలినుండి చూస్తున్న కనకాంగి అక్కడికి వచ్చింది.

"అల్లుడుగారు అప్పుడే దయచేస్తున్నారు. తెల్లవారనివ్వండి" అంది. అత డేమీ మాట్లాడలేదు. వెళ్ళిపోబోయాడు.

"మీరుయిస్తానన్న మిగతాడబ్బు..." అని సణిగింది కనకాంగి. పంకజకు వొళ్లుమండింది. "ఛీ నోర్మూయ్" అని కనకాంగి చెంపమీద వొక్క పెట్టు పెట్టింది. ఆదెబ్బతో కనకాంగికి కళ్లుతిరిగిపోయాయి. కూతురుప్రవర్తన ఆమె కేమీ అర్థంకాలేదు. అతను యేమీమాట్లాడకుండా బయటకు వెళ్ళిపోయాడు.

పంకజ అతనువెళ్ళిపోయినద్వారంవంకే చూస్తూ "పాపం!
అతను మంచివాడు!" అనుకుంది మనసులోనే. కాని, ఆ
మాటలు బయటికికూడ వినిపించాయి.

"ఎంత మంచివాడైతేమాత్రం ఇస్తానన్నడబ్బు యివ్వ
కుండా వెళుతుంటే ఊరుకోవడమే" అంది కనకాంగి.

"మళ్ళీ అదేమాటా?" అంది కోపంతో పంకజ. ఆమె
వొక్కక్షణం తల్లివంకచూస్తూ నిలబడిపోయింది. యెందుకో
పంకజకు దుఃఖం గట్లు తెంచుకునివచ్చేసింది. తల్లినికౌగలించు
కుని పసిపిల్లలా బావురుమనియేడ్చింది "అమ్మా! నా చదు
వుకు భంగంకలిగించకే" అని మాత్రం అనగలిగింది. కనకాంగి
కూడా తన్నకడుపుకావడంచేత పంకజయేడ్పు చూడలేక
పోయింది. ఆమెకళ్ళలోనూ గిర్రున నీళ్ళుతిరిగినై. పంకజతల
నిమురుతూ "వెఱ్ఱిపిల్ల!" అన్నది తర్వాత లోపలికి వెళ్ళిపో
యింది. పంకజ తనగదిలోకి వచ్చి, మంచంమీద పడుకుని,
చాలాసేపు వెక్కి వెక్కి యేడ్చింది. ఇంక చదువుసాగలేదు.
ఆరాత్రి ఆమెకు నిద్ర పట్టనేలేదు.

## 2

పై సంఘటన జరిగి మూడురోజులైంది. ఈ మూడు
రోజులూ పంకజకు మనసు మనసులోలేదు. తనకు తనతల్లి
యెంత ద్రోహంతలపెట్టింది? ఆ అగంతుకు డెవరు? అతడు
డబ్బిచ్చికూడా మాట్లాడకుండా యెందుకు వెళ్ళిపోయినట్టు?
మళ్ళీ వస్తాడేమో ననుకున్నది పంకజ. ఈ మూడురోజులూ
ఆమెకు తెలియకుండానే, అతనిరాకకోసం యెదురుచూచింది.
కాని అతడు తిరిగిరానేలేదు.

ఈ మూడురోజులూ ఆమెకు చదువు సరిగ్గా సాగలేద ఆమె మనస్సు పరిపరివిధాల పరుగెడుతోంది నిజంగా ఉగంటాడు ఎవడు? యెందుకు వెళ్ళిపోయాడు? "నాతో వస్తావా?" అన్నాడు యేవూరివాడై వుంటాడు? ఆ వూరికి యెందుకు వచ్చినట్టు? ప్రతివూళ్ళో స్త్రీని కొంపలచుట్టూ తిరగడమే పనా? అత నెంత ధనవంతుడో? యెంతమంది వేశ్యలను పోషించిన రసికుడో! అంతడబ్బూ తన కిష్టాలనే తీర్చ ముందుపెట్టాడా? యేమో, తనను వశపరుచుకోడానికి వేసిన యెత్తు కాకూడదూ? అతనితో వెడితే తనకోరిక తీరుస్తాడా? యెట్లా నమ్మడం?

బాగా చదువుకుని డాక్టరు కావాలనుకున్న తనకు రక్షణ లేదు. అతడు మంచివాడు కాబట్టి సరిపోయింది. లేకపోతే తన గతేమిటి? అతడు తనను బలాత్కరించివుంటే తా నేమిచేయగలిగేది? అతణ్ణియెదిరించేటంతశక్తి తనకున్నదా? యేమో! నిజంగా అతడు తన నెందుకు బలాత్కరించలేదో! అంత అసమర్థుడా? మరెందుకు వెళ్ళిపోయాడు? అతనిలో అంత పరివర్తన తీసుకు రాగలసమర్థత తన కున్నదా? అతడు తనను బలాత్కరించి, తా నాతనికి లొంగకుండా, అతణ్ణి తిట్టే, తరిమివుంటే బాగుండు నన్న వెర్రిఆలోచన వొకటి యిన్ని ఆలోచనలఅడుగునపడి వుంది. అది ఆమెకు తెలియదు.

ఈ ఆలోచనలతోటే మూడురోజులు గడిచిపోయినై. నాలుగోనాడు తెలుగుపాఠాలుమాత్రం అతిప్రయత్నంమీద పూర్తిచేయగలిగింది. ఆనాటిసాయంకాలం స్కూల్లో టీపార్టీ. స్కూలుపైనలువిద్యార్థులు పరీక్షలైనతరువాత వొకరినొకరు

కలుసుకోవడం పడదుగనుక, పరీక్షలకుముందు జరిగే పిక్నిక్కు
విందు అది. ప్రతిసంవత్సరం ప్రతిస్కూల్లోను యిది పరిపాటే.
నాలుగున్నరకి సరిగ్గా గ్రూప్‌ఫోటోకూడా యేర్పాటుచేశారు.
పంకజకు వెళ్ళాలనిలేదు. అయినా బయలుదేరింది. మామూలు
గానే అలంకరించుకుని బయలుదేరింది. వెళ్ళేముందు తల్లితో
వొకసారి చెప్పివెడుదామని లోపలికి వెళ్ళింది. ఈ మూడు
రోజులూ ఆమె తల్లితో సరిగ్గా మాట్లాడలేదు. కనకాంగికూడా
తనకూతురుతో మాట్లాడ్డానికి ప్రయత్నంచేయలేదు. పంకజ కన
కాంగిగదిదగ్గరికివెళ్ళి లోపలికి తొంగిచూచి, విస్తుపోయి అట్టే
నిలబడిపోయింది. కనకాంగి పదహారేళ్ళయువతిలా తయారైంది.
తల్లి వేషం చూచి కాదు పంకజ ఆశ్చర్యపడటం. ఆమెచేస్తున్న
ప్రయత్నాన్ని చూచి. ఆనాటిరాత్రిసంఘటనతో కనకాంగి
మళ్లీ అటువంటిపని తలపెట్టదనుకున్నది పంకజ. యెందుకంటే,
ఈ మూడురోజులూ యింట్లో యెటువంటి రచ్చా లేదు. కాని,
కనకాంగి మళ్లీ అదేప్రయత్నంచేస్తోంది. ఆమె చాలా నేర్పుతో
అలంకరించుకుంది. బాగా యెరిగివున్నవాళ్ళుకూడా ఆమెకు
పదహారేళ్ళకంటే యెక్కువవయసు వుండదనుకుంటారు హఠా
త్తుగా చూచి. లోపల పావడామీదకుట్టినపూవులు కనపడేలా
వుల్లిపొరలాంటి తెల్లనిచీర కట్టింది. ఊదారంగుజాకెట్టులోంచి
లోపలిబాడీఅంచులు బయటికికనుపిస్తున్నై. చెవులకు చక్రాల
లోలకులు పెట్టింది. ముఖాన కనుపించే ముసలిరేఖలు స్నో
పూతలతో సవరించుకున్నది. పెదిమలకు, చెక్కిళ్ళకు కాస్త
యెఱ్ఱనిరంగు కనపడీకనపడనట్టు పూసింది. సవరంపెట్టి వాలుజడ
వేసుకుని దానిచివర నీలిరంగురిబ్బను కట్టింది. మరువము,

డససము, కనకాంబరాలతో కలిపికట్టిన మల్లెపూలు తల్లో తురుముకున్నది. తల్లో అక్కడక్కడ కనుపించే తెల్లవెంట్రుకలు యెట్లా మాయమైనాయో! నిలువుటద్దంముందు నిలబడి తనఅందం చూసుకుంటోంది కనకాంగి. పంకజ అలాగే ఆశ్చర్యంతో చూస్తోంది కూతురిఆశ్చర్యాన్ని గ్రహించి కనకాంగి "యెందు కంత విస్తుపోయిచూస్తావు? యేమిటా యీ వేషమనా? నీకేం, యెన్నికబుర్లయినా చెబుతావు. యెట్లా గడుస్తుంవన్న ఆలోచన నీకేమైనా వుంటేగా!" అంది. పంకజకు యింక అక్కడ నిలబడడం యిష్టంలేదు. యివతలకివచ్చేస్తోంది

"యెక్కడికి ప్రయాణం?" అని అరచింది కనకాంగి.

"స్కూలుకి—" యిష్టంలేకపోయినా జవాబు చెప్పింది పంకజ నడుస్తూనే.

"మళ్ళీ యెప్పుడు తిరిగిరావడం?" మళ్ళీ కనకాంగి అడిగింది.

"యేమో, చెప్పలేను." అంటూ ఇవతలికి వచ్చేసింది పంకజ.

పంకజ బయటకు వచ్చేటప్పటికి నాలుగు దాటిపోయింది. ఆమెయింటికీ ఆమెచదువుతున్న గరల్స్ హైస్కూలుకీ సరిగ్గా మైలుదూరం ఉంది. నడిచివెడితే ఆలస్యమౌతుందని ఒక టాంగా మాట్లాడుకుని బయలుదేరింది. టాంగా స్కూలుకి చేరేటప్పటికి నాలుగున్నర అయింది. ఆమె బండివాడికి బాడుగ యిచ్చి లోపలికి వెళ్ళేటప్పటికి విద్యార్థినులందరూ ఫోటోకు సిద్ధంగా నిలబడివున్నారు. ఆమెవెళ్ళి ఆఖరువరుసలో సర్దుకుని నిలబడడం, ఫొటోగ్రాఫరు "రెడీ" అని కామెరా క్లిక్

మనిపించడం వొక్కసారే జరిగినై. ఫోటోతాగానే పిల్లలు, టీచర్లూ అల్పాహారవిందుకు హాల్లోకి వెళ్ళారు. పంకజకూడా లోపలికి వెళ్ళింది పంకజ వొక్కసారి అక్కడకువచ్చినపిల్లలు కట్టుకున్నచీరలవంక, తనుకట్టుకున్నచీరవంక చూసుకుని సిగ్గుచే ముఖం దించేసుకుంది. తనుకట్టుకున్నచీర యేమంత విలువైనది కాదు. మెడలో వొక సన్నని గొలుసుతప్ప వేరే నగలేమీ లేవు. చేతులకు సాదాగాజులుమాత్రం వున్నాయి. చిత్రవిచిత్ర మైన వస్త్రాభూషణముల ధరించి, మురిసి, మెరసిపోతున్న తక్కినవిద్యార్థినులముందు నిలబడడం ఆమెకు కష్టంగానేఉంది. కాని, ఆ స్కూల్లో తనస్థితి తనకు తెలుసు. తక్కినపిల్లలందరూ కులీనకుటుంబాల్లో పుట్టినవారు. మరి తనో! కానుకు శరీరం అమ్ముకునేదానికడుపున పుట్టింది. యెంత నీచం! ఆస్కూల్లో చదువుకునే హరిజనబాలికకు వున్నపాటి గౌరవంకూడా తనకు లేదు.

తను కనకాంగికూతురని ఆ స్కూల్లోపిల్లలందరికీ తెలుసు. టీచర్లకూ్కడా బాగా తెలుసు. తానంటే, పాఠాలు యెంత బాగా చదివినా.. టీచర్లకూడా వొకవిధమైన చులకన భావనే. తనయెదుట యెవ్వరూ యేమీ అనకపోయినా, చాటుగా తననుగూర్చి అవహేళనగా మాట్లాడుకోడం చాలా సార్లు విన్నది. ఆస్కూల్లోతాను చిన్నప్పటినుండి చదువుతున్నా, ఆమె తోటివిద్యార్థినులెవరియింటికీ వెళ్ళియెరుగదు. ఆమెఇంటికి కూడా యెవరూ రారు. చిన్నక్లాసుల్లో యెంతో స్నేహంగా వున్నవారుకూడా హైక్లాసులకువచ్చేటప్పటికి దూరందూరంగా వుండటం మొదలుపెట్టారు. ఇటువంటిపరిస్థితిలో తను విలువైన

చీరకట్టుకుంటేమాత్రం గౌరవం వస్తుందా అన్న అభిప్రాయంతో ఆమె మామూలుచీరతో వచ్చేసింది.

ఆమె కసలు పార్టీకి రావడమే యిష్టంలేదు. నర్మద కోసం రావలసివచ్చింది. ఇంతమందిలో నర్మద వొక్కతే తనకు ఆప్తురాలు. ఆమె ఆసంవత్సరమే ఆస్కూల్లో చేరింది. అంతకుముందు ఐదవఫారంవరకు ఆమె నెల్లూరులో చదువు కుంది. ఆమె తండ్రి నిజాంప్రభుత్వంలో తుంగభద్రాప్రాజెక్టు నిర్మాణానికి వొక ముఖ్యసలహాదారుగా ఆ సంవత్సరమే నియ మింపబడ్డాడు. నర్మద స్కూల్లోచేరిన కొన్నిరోజులకే తక్కిన పిల్లలు పంకజసంగతి పనిగట్టుకొని ఆమెకు చెప్పేశారు. అయినా, నర్మద పంకజఅంటే యెంతో సానుభూతితో వ్యవహరించేది. తనయింటికి రమ్మని యెన్నోసార్లు ఆహ్వానించేది పంకజను. కాని 'మీలాంటివారియిళ్ళకు వచ్చేఅర్హత నాకు లేద'ని పంకజ వెళ్ళేదికాదు.

పాటలతో, పరిహాసాలతో విందు యెంతో కులాసాగా ముగిసింది. తరువాత హెడ్‌మిస్ట్రెస్ చదువుకున్నస్త్రీలు యే విధంగా నడుచుకోవలసిందీ వొక చిన్న వుపన్యాసంయిచ్చి, కార్యక్రమం ముగించింది. పిల్లలలందరూ బయటకు వచ్చేటప్ప టికి యేడున్నర అయింది. వొక్కొక్కరే యిళ్ళకు వెళ్ళి పోయారు. పంకజ నర్మదకారుదాకా ఆమెతో వచ్చింది. నర్మద కారులో కూర్చుంది పంకజనుకూడా యెక్కమన్నది.

"వొద్దు. నడిచేవెళతాను" అంది పంకజ.

"యెందుకు, కారుందికదా, మీయింటిదగ్గర దిగబెడ తానుగా" అంది నర్మద.

నర్మద తనయింటికి రానడమా! పంకజ యేమీ మాట్లాడలేక పోయింది.

"నీబాధ నాకు తెలుసు. పద, ఆ రోడ్డుమలుపుదగ్గర దిగబెడుతాను" అంది నవ్వుతూ నర్మద పంకజ మారు మాట్లాడకుండా వెళ్ళి, కారులో కూర్చుంది. కారు వెడుతోంది. దారిలో పంకజ "పాఠాలన్నీ బాగా రివైజ్ చేశావా?" అని అడిగింది.

"ఆ. మరినీనో?" అంది నర్మద.

"చేశాను. తరువాత నీవు ఇంటరు చదువుతావా?"

"నాకు వీలువడదు. నీవు?" అంది నర్మద.

"చదవాలనేవుంది. పరీక్షలు కానివ్వు. మరి, నీ వెందుకు చదువుమానేస్తావు?" అని అడిగింది పంకజ. నర్మద యేమీ జవాబు చెప్పలేదు. ఇంతలో రోడ్డుమలుపు వచ్చింది. ఇద్దరూ కారుదిగి, రోడ్డుపక్కన యెలెక్ట్రిక్ దీపస్తంభంక్రింద నిలబడ్డారు.

"మళ్ళీ యెప్పుడు కలుసుకోవడం?" అంది నర్మద పంకజచేతులను తనచేతుల్లోకి తీసుకుంటూ.

"ఇట్లాగే యెప్పుడైనా తటస్థపడినప్పుడు" అంది పంకజ.

"అంతేనా. ఇంత మనసిచ్చి పిలిచినా, మాయింటికి రాగూడదా? మీయింటికి నన్ను రాగూడదనడంలో అర్థం వుంది. మాయింటికి వస్తే తప్పేమిటి?" అంది నర్మద.

"మీలాంటివారియిండ్లకు వచ్చేఅర్హత నా కింకా కలుగలేదు——" అంది పంకజ.

"నీ కా అర్థాత కలిగేలోపల నేనే మీ యింటికి రావలసివస్తుందేమోలే" అంది నర్మద నవ్వుతూ.

"నన్ను యెగతాళిచేయకు నర్మదా! వీలుచూసుకుని తప్పకుండా వస్తానులే..." అంది పంకజ.

ఇంతసేపు పైన దీపంచుట్టూ తిరుగుతున్న పెద్ద పురుగొకటి హఠాత్తుగా నర్మదమీదపడి, ఆమెజాకెట్టులోపల దూరింది. కంగారుగా దాన్ని బయటకు తీసే ప్రయత్నంలో ఆమెజాకెట్టులోపల వేసుకున్న మంగళసూత్రం బయటపడింది. నర్మద తానువివాహితనని యింతకాలం యెవరితోనూ చెప్పలేదు. పంకజకు నవ్వువచ్చింది.

"అమ్మదొంగ! యిప్పుడర్థమైంది" అంది.

"ఏమిటి?"

"నీవు చదువెందుకుమానేస్తున్నావో. పరీక్షలుకాగానే అత్తవారింటికి ప్రయాణంకాబోలు" అంది కొంటెగా.

నర్మద సిగ్గుతో తలవంచుకుంది. ఆమెబుగ్గల్లో వ్యాపించిన లేతగులాబిరంగు విద్యుద్దీపకాంతిలో స్ఫుటంగా కనుపిస్తోంది. "పొద్దుపోయింది, నే నిక వెడుతాను" అని వెళ్ళి కారులో కూర్చుంది. కారు శరవేగంతో కనుచూపుమేర దాటిపోయింది. "ధన్యురాలు" అని పెద్దగా నిట్టూర్చింది పంకజ. బరువుగా అడుగులువేస్తూ ఇంటిముఖంపట్టింది.

పంకజ ఇల్లుచేరుకునేటప్పటికి యింటితలుపుకు లోపల గొళ్ళెంపెట్టివుంది. చాలాసేపు కొట్టినతరువాత తలుపు తెరువబడింది. ఆమె లోపలికి ప్రవేశించింది కాని, కనకాంగి కను

పించలేదు. ఆమె తనగదిలోకి వెళ్ళి చీరమార్చుకుని విడచిన చీర మడుస్తుండగా లోపలినుండి యెవరో తూలుతూ బయటికి వెళ్ళడం చూచింది వెంటనే ఆమె కనకాంగిగదిలోకి వెళ్ళింది. కనకాంగి యేదో బీరువాలో దాచి, యేమీ యెరుగనట్టు మంచంమీద కూర్చుంది. గదిఅంతా గుప్పుమని బ్రాందీవాసన కొడుతోంది. పంకజ బీరువా తెరచిచూచింది. అందులో పెద్ద బ్రాందీసీసా కనుపిస్తే బయటికి తీసింది. కనకాంగి ఇన్నిరోజులు తాగుడు యెరుగదు. ఇప్పుడు అదికూడా మొదలుపెట్టినట్టుంది. పంకజ కనకాంగివంక, సీసావంక తీవ్రంగా చూచి "ఛీ! పాపిష్టి జన్మ!" అంటూ సీసాను నేలకేసివిసరికొట్టింది. కనకాంగి నోరు విప్పలేదు. పంకజ గబగబ వచ్చి తనమంచంమీద వాలిపోయింది. "ఈ కొంపలోనుంచి బయటకువెళ్ళినా తనను ఆదరించేవాళ్ళు లేరే" అని వాపోయింది. ఆరాత్రికూడా ఆమెకు నిద్ర దూరమైంది.

## 3

ఇంట్లో దేవుడు తన్నుచేస్తున్న పరీక్షలను యెదురొడ్డుంటూ పంకజ స్కూల్‌ఫైనలుపరీక్షలకు వెడుతోంది. పరీక్షలు హైదరాబాదులో మూసీనది కొత్తవంతెనకు పాతవంతెనకూమధ్యనున్న సిటీకాలేజిలో జరుగుతున్నవి. ఈసారి ఆడపిల్లలకుకూడా అక్కడే యేర్పాటుచేశారు. ఒక్క హైదరాబాదు, సికింద్రాబాదు విద్యార్థులేగాక, నిజాంరాష్ట్రంలోని స్కూల్‌ఫైనల్‌తరగతి విద్యార్థులందరూ పరీక్షలకు అక్కడికే రావాలి. అది ఒక్కటే పరీక్షాకేంద్రం.

సికింద్రాబాదువిద్యార్థులు అంతదూరం వెళ్ళడానికి ఆ యా స్కూళ్ళఅధికారులు ప్రత్యేకమైనబస్సులు యేర్పాటు చేశారు. మళ్ళీ వాళ్ళను వారి స్కూళ్ళదగ్గర దిగబెడితే, యెవరియిళ్ళకు వారు పోతారు. ఇందుకు డబ్బు విద్యార్థుల వద్దే వసూలుచేశారు. నర్మదమాత్రం తనస్వంతకారులోనే పరీక్షలకు వెడుతోంది. పంకజనుకూడా తనవెంట కారులో తీసుకువెడుతోంది. రోజూ రోడ్డుమలుపుదగ్గరకు వెళ్ళి, నర్మద కోసం యెదురుచూస్తుంది పంకజ. నర్మద అక్కడికి వచ్చి ఆమెను కారులో యెక్కించుకుని వెడుతుంది. మళ్ళీ సాయంకాలం యింటికివెళ్ళేటప్పుడుకూడా పంకజను ఆ రోడ్డుమలుపు దగ్గర దిగబెట్టి మరీ వెడుతుంది నర్మద.

పరీక్షలు పూర్తిఅయినవి. పంకజ తానుఅనుకున్నంత తృప్తికరంగా రాయకపోయినా అన్నిపేపర్లూ బాగానే రాసింది. నర్మదకూడా బాగానే రాసింది. అయినా, పరీక్షల విషయమై ఆమె కంత పట్టింపువున్నట్టు కనుపించదు.

తరువాత ఫలితాలు యెట్లావచ్చినా, పరీక్షలుఅయి పోయిననాటిసాయంకాలంమాత్రం మనసు తేలికపడుతుంది. నర్మద, పంకజ ఆఖరురోజుసాయంకాలం యింటికి తిరిగివస్తున్నారు. దారిలో "పరీక్షలు పూర్తిఅయినవి. ఇంక అత్త వారింటికి వెడతావుగాబోలు. యెప్పుడు ప్రయాణం?" అని అడిగింది పంకజ.

"ఏమో! మంచిరోజుచూడాలి" అంది నర్మద నవ్వుతూ. ఆమె నవ్వినప్పుడు ఆమెబుగ్గలు తెరచావలాగా పైకివుబ్బినై. నర్మదకూడా అందకత్తెయే. కాని పంకజ అంత అందకత్తెకాదు.

"ఎగతాళికాదు. నిజం చెప్పు" అంది పంకజ.

"బహుశా యింకోవారంరోజుల్లో వెళ్ళవచ్చు" అంది నర్మద. పంకజ నర్మదభర్తనుగురించీ, అత్తవారింటినిగురించీ చాలా అడిగింది. కాని నర్మద చెప్పడానికి సిగ్గుపడింది. పంకజ మరీమరీ అడగ్గా క్లుప్తంగా చెప్పింది.

ఆమెకు పదమూడవయేటనే పెళ్లైంది. ఆమెభర్త ఆమె మేనత్తకొడుకే. చీరాలలో వుంటాడు. తనకంటే రెండుసంవత్సరాలే పెద్ద. అతడుకూడా ఈసారే స్కూల్ ఫైనల్ కు వెడుతున్నాడు. బహుశా పైచదువుకు మద్రాసువెడితే వెళ్ళవచ్చు. తనుకూడా అక్కడే వుంటే, అతనిచదువుకు భంగంకలుగుతుందని పుట్టింట్లోనే వుంటోంది. తను చదువుకోడం తనఅత్తగారికి బొత్తిగా యిష్టంలేదు. కాని తనతండ్రిప్రోద్బలంవల్లనే ఇంత వరకు చదువుతోంది.

ఈవిషయాలన్నీ ఆమె చాలా సంకోచపడుతూ చెప్పింది. యెందుకో, యెంత చదువుకున్నా కొంతమందిఆడవాళ్లు భర్త విషయాలు చెప్పడానికి చాలా బిడియపడుతారు.

పంకజమనస్సెందుకో చెప్పుకోరానిమథనపడసాగింది. తన కిటువంటివిషయాలు వొకరితో చెప్పుకునేఅవకాశాలు లేవు. యింక కలుగబోవు. ఆమె నర్మదకేసి చూస్తూ పెద్దగా నిట్టూర్చింది.

"భర్తదగ్గరికి వెళ్ళినతరువాత నన్ను మరచిపోవుగదా" అంది ప్రయత్నపూర్వకంగా నవ్వుతెచ్చుకుంటూ, "నీవంటి స్నేహితురాండ్రు దొరకడం అపురూపం." అంది మళ్ళీ.

"యెందుకు మరిచిపోతాను? నాకుమాత్రం నీలాంటి స్నేహితురాండ్రు యింకెవరున్నారు?" అని జవాబు చెప్పింది నర్మద.

పంకజ నర్మదముఖంలోకి చూస్తూ "నర్మదా, నీవు నాకు నిజమైన స్నేహితురాలివి. నీ యీ స్నేహానికి నే నేవిధంగా కృతజ్ఞతచూపించగలను!" అంది.

"ఇప్పుడు తిన్నగా మా యింటికి రావడంతో" అంది నర్మద నవ్వుతూ. పంకజను యెల్లాగైనా ఆపూట తనయింటికి తీసుకెళ్ళాలనే నిశ్చయించుకున్నది నర్మద. ఈ ప్రత్యుత్తరం పంకజను హఠాత్తుగా కలవరపెట్టింది. వెంటనే యేంజవాబు చెప్పాలో ఆమెకు తోచలేదు.

"నేను వాళకరిఇండ్లకు యెందుకు రానో ఆసంగతి నీకు బాగా తెలుసు. తెలిసివుండికూడా యెందుకు నన్నిట్లా బాధ పెడతావు?" అంది పంకజ.

"ఒకరిసంగతి నా కనవసరం; నామనస్సు నీకు తెలియదా?" అంది నర్మద.

"తెలుసు. కాని..."

"నీప్రవర్తన మంచిదైనప్పుడు వాళకరియిళ్ళకు వెళ్ళడానికి నీ వెందుకు జంకాలి?...అయినా నీ బాధేమిటో నా కర్థంకాదు."

"డబ్బుకోసం నీచంగా శరీరాన్నమ్ముకునేదానికడుపున పుట్టాను. అదీ నాబాధ." అంది పంకజ దీనంగా.

నర్మదకళ్ళల్లో జాలి ప్రతిఫలించింది.

"తీరాపుట్టావు. యిప్పుడు బాధపడిమాత్రం యేం

ప్రయోజనం? నీ జన్మహీనత నీతోగాని పోదు. అయినా తలి దండ్రులుచేసినపాపానికి బిడ్డ లెట్లా కర్తలవుతారు?" ఈ చివరి మాటలు నర్మద కాస్త వుద్రేకంగానే అన్నది.

పంకజకు నవ్వువచ్చింది నర్మదమాటలు వినగానే.

"నర్మదా! నీవు ఆగర్భశ్రీమంతురాలవు; కులీనవు. లోకంపట్ల జాలికలదానవు. కాని లోకజ్ఞానం నీకు తగినంతగా వున్నట్టులేదు. నీవు చూచినట్టుగానే లోకంలో అందరూ నన్ను చూస్తారని భ్రమపడుతున్నావు. నా ప్రవర్తన మనస్కూల్లో పిల్లలందరికీ తెలియదా? అయినా వాళ్లు నన్నుగూర్చి ఎందు కంత హేళనగా మాట్లాడుకుంటారు? నా మంచినడతతో లోకానికిపనిలేదు నర్మదా!"

"నీ విట్లాగే బాధపడుతూవుండవలసిందేనా? యెంత కాలమని?"

"ఒకరిమీద ఆధారపడి బ్రతుకుతున్నంతకాలం నాకీ బాధ తప్పదు. నేను స్వతంత్రంగా బ్రతికే అవకాశాలు నాకు కలగాలి. నా జీవనోపాధికి నే నవలంబించేవృత్తి వొకవిధంగా సంఘశ్రేయోదాయకంగా వుండాలి. అప్పుడుగాని లోకం నన్నూ నా జన్మనూ నీచంగా చూడటం మానుకోదు. బురదలోపుట్టినా నలుదిక్కులా సౌరభాన్ని వెదజల్లే కమలాన్ని చూచి లోకం హర్షిస్తుంది."

ఈ మాటలంటున్న పంకజముఖంలో వొక విచిత్ర కాంతిని చూడగలిగింది నర్మద.

"బురదలో యెన్నో పుడుతాయి అన్నీ కమలాలు

కావు. నీలాగే యెందరు పుట్టలేదు నీవు నీ పంకజఅన్న పేరును సార్థకంచేసుకుంటావు" అన్నది నర్మద.

ఇంతలో నర్మదయిల్లు వచ్చేసింది. చుట్టుపక్కల యిండ్లతో సంబంధంలేకుండా చుట్టూ కాంపౌండుగలిగి, అంగులో పూలమొక్కలతో చూడముచ్చటగావున్న ఓ చిన్న బంగళా అది. ఇద్దరూ కారుదిగి లోపలికి వెళ్లారు. చల్ల గాలికి కదులాడుతున్న పూలమొక్కలు పువ్వుహాసంతో వారిని లోపలికి ఆహ్వానిస్తున్నట్టున్నై.

నర్మద పంకజను తనగదిలోకి తీసుకెళ్ళి వొకసోఫాలో కూర్చోపెట్టి "యిప్పుడే వస్తానుండు"అని లోపలికి వెళ్ళింది.

పంకజ గదిని పరిశీలనగాచూస్తూ కూర్చుంది. గది ఆధునికపద్ధతిలో సాధారణంగా అలంకరింపబడివుంది. ఒక వంక వొక సోఫాసెట్టు, వొకపక్కన రేడియో, మరొకపక్కన నర్మదచదువుకోడానికి, రాసుకోడానికి టేబులూ, పైన పుస్త కాలషెల్ఫు. గోడమీద నాలుగు ముజుందార్ చిత్రించిన చిత్ర పటాలు వున్నై. ఆగదిని చూచి ముచ్చటపడుతున్న పంకజకు లోపల యేదో మధనగానే వుంది. సంఘంలో తనస్థితికీ నర్మద స్థితికీ మధ్యగల తారతమ్యాన్ని గురించిన ఆలోచనలు ఆమెకు అప్రయత్నంగా కలుగుతున్నై. ఆమె తనమనస్సును సావధాన పరచుకోడానికి ప్రయత్నిస్తున్నసమయంలో నర్మద కాఫీ, ఫల హారం పట్టుకొచ్చి ఆమెముందు పెట్టి, తినమని బలవంత పెట్టింది.

పంకజ ఫలహారంచేసి, కాఫీ తాగింది. తరువాత నర్మద వచ్చి, ఆమెపక్కనే సోఫాలోకూర్చుంది. కాస్సేపు యిద్దరూ

మౌనంగానే కూర్చున్నారు. తీరా యింటికితీసుకొచ్చిందే గాని, పంకజతో యేం మాట్లాడాలో ఆమెకు తోచలేదు. యేం చేయాలో తెలియక, రేడియో తిప్పింది. ఇద్దరూ సంగీతం వింటూ కూర్చున్నారు. ఇంతలో నర్మదతండ్రి వేంకటశేషయ్య గదిలోకి వచ్చాడు—"ఈవేళ పేపరు యెట్లా అన్సరుచేశావు తల్లీ?" అంటూ. నర్మద రేడియో ఆపింది.

"బాగానే అన్సరుచేశాను నాన్నా. యిదుగో, పేపరు" అంటూ పంకజచేతులోవున్న ప్రశ్నలపత్రిక తండ్రిచేతికిచ్చింది. ఆయనగారు పేపరును నిదానించి చూస్తున్నాడు పంకజ నర్మద వంకా, ఆమెతండ్రివంకా చూస్తూ కూర్చుంది. తన కిటువంటి యోగ్యత లేదనుకొని పంకజ మనసులో కుమిలిపోతోంది.

క్వశ్చన్ పేపరు తిరిగి కూతురుచేతికిస్తూ వేంకట శేషయ్య పంకజవంక పరిశీలనగా చూచాడు.

"ఈమె నీ క్లాసుమేటా తల్లీ?" అని కూతుర్ని ప్రశ్నించాడు.

"అవును నాన్నా!..." అంది నర్మద.

"సంతోషం. యెవరమ్మాయి మీరు?" అన్నాడు పంకజవంక చూస్తూ.

యేం జవాబుచెప్పడం? సిగ్గుతో, అభిమానంతో పంకజమొహం యెర్రబారిపోయింది. తండ్రి యీప్రశ్న అడుగుతాడని నర్మదకూడా అనుకోలేదు. యెందుకో అబద్ధంచెప్పాలని క్షణంలో నిశ్చయించుకుంది. "మన నియోగులే నాన్నా" అనేసింది తడుముకోకుండా.

పంకజలో ఇంకా వుద్వేగం తగ్గలేదు.

"అలాగా, మీ నాన్నగారు యేంచేస్తారమ్మా?"
అన్నాడు సహజంగానే. తనతండ్రియెవరో యెక్కడో వున్నట్టు
కనకాంగి యెప్పుడో తనతో చెప్పింది. ఆమెనోట మాట
రావడంలేదు. పంకజను ఇంటికితీసుకొచ్చి అవమానపరుస్తున్నట్టు
తోచింది నర్మదకు. ఒకఅబద్ధం యెలాగూ చెప్పానుకదా అని
"పాపం! ఆమెతండ్రి చిన్నప్పుడే పోయాడు. తల్లే కష్టపడి
చదువుచెప్పిస్తోంది" అన్నది.

"పాపం! కష్టపడి చదువుకో అమ్మా!" అంటూ
లోపలికి వెళ్ళిపోయాడు. పంకజకు ఆపుకోలేనంతదుఃఖం వచ్చే
సింది. యింక అక్కడ వొక్కక్షణం వుండలేకపోయింది. లేచి
ఇవతలకు వచ్చింది. నర్మద ఆమెను అనుసరించి బయటిదాకా
వచ్చింది.

"ఇందుకే నర్మదా! వొకరియిళ్ళకు నేను రానదేది"
అంది పంకజ.

"క్షమించు పంకజా! యిట్లా జరుగుతుందనుకోలేదు"
అంది బాధను దిగమింగుకుంటూ నర్మద.

"ఇందులో నీతప్పేముంది? మీనాన్న సహజ
వాత్సల్యంతోనే అడిగాడు. కాని, చెప్పుకునేఅర్హత నాకేది?
అబద్ధాలుచెప్పి కాని నేను కులీన ననిపించుకోలేను. నావిష
యంలో నీవు నిజమే చెప్పివుండవలసింది" అంది పంకజ.

నర్మద ఏమీ మాట్లాడలేకపోయింది.

"ఇప్పటికైనా మించిపోయిందేమీ లేదు. మీతండ్రి
గారితో నిజంచెప్పడం మంచిది. ఇంక నేను వెళ్ళివస్తా"నంటూ
ఆమె నర్మదదగ్గర శెలవుపుచ్చుకుని బయలుదేరింది.

బాగా చీకటిపడిపోయింది. రోడ్డుమీద మునిసిపల్ దీపాలు అప్పుడే వెలిగించారు. ఆ వెలుతురుకు బయటిచీకట్లు తొలగినాయి. కాని, ఆమె హృదయంలో వ్యాపించిన చీకట్లు మాత్రం తొలగలేదు. ఆమె అలాగే యింటిముఖంపట్టింది బరువుగా అడుగులు వేస్తూ.

## 4

గదిలో లైటు గప్పునవెలిగింది. పంకజ వెళ్ళిపోగానే గదిలోకివచ్చి ఆవేదనపడుతూ కూర్చున్న నర్మద యింత సేపూ గదిలో లైటులేనిసంగతి గమనించనేలేదు.

"యేం తల్లీ! వొంట్లో బాగాలేదా?" అంది ఆమె తల్లి సుభద్రమ్మ నర్మదతల నిమురుతూ.

"యేమీలేదు—" అంది నర్మద.

"మరి ఇట్లా చీకట్లో కూర్చున్నావేం? పద భోజనానికి. మీనాన్నగారు నీకోసం కనిపెట్టుకొని కంచంముందర కూర్చున్నారు" అంటూ సుభద్రమ్మ లోపలికి దారితీసింది.

నర్మద తల్లిననుసరించి లోపలికి వెళ్ళింది. కాళ్ళు చేతులు కడుక్కొని వచ్చి, తనకంచంముందు కూర్చుంది. సుభద్రమ్మ వడ్డన ప్రారంభించింది. నర్మదకు నిజంగా అన్నంతినాలని లేదు. మనస్సులో యేదో చెప్పుకోరానిఆవేదన. కడుపులో కలతేస్తోంది. మౌనంగా అన్నంకలుపుకుతినడం ప్రారంభించింది.

"అదోమాదిరిగా వున్నావేం తల్లీ? వొంట్లో బాగా లేదా?" అని అడిగాడు వేంకటశేషయ్య.

"యేంలేదు నాన్నా! మత్తుగా నిద్రవస్తే పడుకుని నిద్రపోయాను" అంది అన్నంతింటూనే.

వేంకటశేషయ్యకూడా తినడంలో లీనమైనాడు. తృప్తిగా తింటాడు. అన్నీ వైనంగా అడిగి వడ్డించుకుని తింటున్నాడు.

నర్మద యెందుకో తండ్రిని ఒక్కక్షణం నిదానించి చూసింది.

"నీవు సానులను యెరుగుదువా నాన్నా?" అని అడిగింది.

కూతురునోటినుండి హఠాత్తుగావచ్చిన యీప్రశ్న బాణంలాగా వేంకటశేషయ్య చెవిలో దూరింది. అతడు నోట్లో పెట్టుకోబోతున్న ముద్దను కంచంలోవదిలేసి కూతురువంక ఆశ్చర్యంగా చూశాడు.

ఆ ప్రశ్న భర్తను కలవరపెట్టినట్టే సుభద్రమ్మనుకూడా కలతపెట్టింది. ఆమె భర్తవంక అనుమానంగా చూస్తూ నేతిగిన్నె చేతపట్టుకుని అక్కడే నిలబడిపోయింది వాళ్ళు యేం మాట్లాడుకుంటారో వినాలన్న వుద్దేశంతో.

"ఏమిటే!..."అన్నాడు కూతురుప్రశ్న సరిగాఅర్థంగాక.

"ఏమీలేదు. నీవు సానులను యెరుగుదువా అన్నాను" అంది నర్మద మళ్ళీ.

నర్మద యిట్లా అడగడంలో ఆమెవుద్దేశమేమిటో అతని వూహకు అందడంలేదు. తనకూతురు తనప్రవర్తనను శంకిస్తోందా? తను యే సానికొంపలోదూరడం చూసింది!

"ఇట్లా అడగడంలో నీవుద్దేశం?" అన్నాడు వేంకటశేషయ్య.

తండ్రి తనప్రశ్నను తప్పుగా అర్థంచేసుకున్నాడని తెలుసు కుంది నర్మద. నాలుక కొరుక్కుంది. బహుశా ఆమె అడగదల చినప్రశ్న సానులు యెటువంటివారో నీ వెరుగుదువా? అని అయివుండాలి. అందుకని మళ్ళీ తండ్రితో "సానులనుగూర్చి నీ అభిప్రాయ మేమి"టని అడిగింది.

ఈమాటతో వేంకటశేషయ్యకూ, సుభద్రమ్మకూ కూడా శాస్త్ర మనస్సులు కుదుటపడ్డాయి.

మళ్ళీ వేంకటశేషయ్య మామూలుగా భోజనం ప్రారంభించాడు. "సాని అని నీవు అంటూనేవున్నావు. డబ్బుకు శరీరాన్నమ్ముకునేవారిని గురించి లోకంలో అందరికీ వొకేఅభిప్రాయం వుంటుంది" అన్నాడు.

"వారికిపుట్టినబిడ్డలకు లోకంలో యెటువంటిస్థానం వుంటుంది?" అని అడిగింది నర్మద తండ్రిముఖంలోకి నిదానించి చూస్తూ.

"వారి కేస్థానమో వారిసంతానానికీ అదేస్థానం వుంటుంది" అన్నాడు వేంకటశేషయ్య తన అభిప్రాయాన్ని బయటపెడుతూ.

"ఎందుకు? వారు సత్ప్రవర్తనగలవారైనప్పటికీనా!" అంది మళ్ళీ నర్మద.

"సానిబిడ్డలకు సత్ప్రవర్తన!..." విరగబడినవ్వాడు వేంకటశేషయ్య. "ఆడపిల్ల అయితే తల్లిఛాయల్లోనే నడుస్తుంది ఇక మగపిల్లవాడైతే, అక్కా, చెల్లెలో కాలికిగజ్జెకట్టి నప్పుడు పక్కన తాళంవేస్తుంటాడు. వారికా కూపంలోనే

బ్రతుకు. ఇంక సత్ప్రవర్తన వారి కెల్లా అబ్బుతుంది?" అన్నాడు.

ఒకతండ్రికీ ఈడొచ్చిన వొకకూతురికీ మధ్య ఇటువంటి సంభాషణ అసాధారణమైనదని వేంకటశేషయ్యకీ, నర్మదకీ కూడా బాగా తెలుసు. అయినా, యిందులో సంకోచపడవలసింది యేమీలేదని ఇద్దరికీ వొకేఅభిప్రాయం కలిగింది.

"సానికిపుట్టిన వొకఅమ్మాయి పొరపాటున సద్వర్తన గలదవుతుందనుకోండి. అటువంటిదాన్ని కూడా లోకం ఎందుకు నీచంగా చూస్తుంది?" అని అడిగింది నర్మద.

"నీవు చెప్పేలాంటిపిల్ల యే చింతామణిలాంటిదో తప్ప ...లోకంలో అరుదు. ఏదేశంలోనైనాసరే, ఆ యా దేశ సాంఘిక మతనియమాలకులోబడ్డ దాంపత్యానికి కలిగినసంతానాన్ని లోకం గౌరవిస్తుంది. అందుకుభిన్నంగా గలిగిన సంతానాన్ని లోకం యేవిధంగా గౌరవిస్తుంది?" అన్నాడు వేంకటశేషయ్య.

ఇంక తండ్రితో వాదించడం యిష్టంలేదు నర్మదకి. కడుపునిండినట్లు లేచి చెయికడుక్కునివచ్చి తనగదిలో కూర్చుంది. రేడియోతిప్పితే గోలగా పాటవచ్చింది. వినలేక ఆ వేసింది. సోఫామీదకూర్చుని 'Illustrated Weekly' పేజీలు తిరగవేస్తూంటే, భోజనముగించుకుని వేంకటశేషయ్య కూతురు దగ్గరకు వచ్చాడు.

"ఎవర్ని మనసులోవుంచుకుని ఇంతసేపు వాదించావ్?" అని ప్రశ్నించాడు నర్మదను.

"సాయంకాలం వచ్చిన అమ్మాయిని. ఆమె వొక వేశ్యకూతురు. కాని, ఆ బ్రతుకామె కిష్టంలేదు..." అంది నర్మద.

వేంకటశేషయ్య యేమీ మాట్లాడలేదు. గదిలోంచి బయటకు వెళ్ళిపోయాడు.

రాత్రి చాలా సేపటివరకు నర్మదకు నిద్రపట్టలేదు. అలాగే ఆలోచిస్తూ పడుకుంది. ఆమె నిద్రలేచేటప్పటికి బాగా పొద్దెక్కి-పోయింది. మొహంకడుక్కుని తనగదిలో కూర్చుని, కాఫీ తాగుతూండగా వేంకటశేషయ్య గదిలోకి వచ్చాడు.

"చూడు తల్లీ! ఆ అమ్మాయి యెంత మంచిదైనా ఆమెతో స్నేహం నీకు తగదమ్మా" అన్నాడు.

ఈ మాటలు నర్మదను ఆశ్చర్యపెట్టినట్టులేదు. ఆమె తండ్రికి జవాబుచెప్పకుండా మౌనంగా వుండిపోయింది. వేంకట శేషయ్యకూడా యింతకంటే యేమీ అనలేదు. గదిలోంచి వెళ్ళిపోయాడు.

మూడురోజులు గడిచినై. ఈ మూడురోజులూ నర్మద ఆనాటిరాత్రి పంకజకుజరిగినఅవమానం, తనతండ్రితోటిచర్చ లనుగురించే ఆలోచిస్తోంది అంతకంటే యేంచేయాలో ఆమెకు తోచలేదు. మూడవనాటిమధ్యాహ్నం లోకల్ పోస్టులో నర్మద పేరిట వొకవుత్తరం వచ్చింది. విప్పిచూచింది. పంకజరాసింది-

నర్మదా!

ఈపాటికి మీనాన్నతో నన్నుగూర్చినిజం చెప్పే వుంటావనుకుంటాను. అంతా విని ఏమన్నారు? బహుశా నాతో నీకు స్నేహంపనికిరాదని అనివుంటారు. అంతేనా?

లోకంలో అందరికంటే భిన్నంగా వారు నాపట్ల మరో అభి ప్రాయంకలిగివుండటానికి వీల్లేదు ఒకవేళ కలిగివుంటే, ఆయన వుదారస్వభావానికి నే నెట్లా కృతజ్ఞత తెలుపడమో నాకు తెలియకుండావుంది.

యేమైనా నీవు బిడావాళ్ళనుఅనుసరించి వుండడమే మంచిది. నాకోసం నీ భావాలను పాడుచేసుకోడంలో అర్థం లేదు. నీ సానుభూతే చాలు నాకు. భర్తయింటికివెళ్ళే నీకు యెప్పుడూ సుఖాన్నే కోరుతున్నాను. నన్ను కులవృత్తిలోకి దింపాలని మా తల్లి చేసేప్రయత్నాలు యిన్నీఅన్నీకావు. ఈ స్థితిలో నా పైచదువు సాగుతుందన్నఆశ నాకులేదు. అయినా అన్నిటికీ దైవమే గతి. ఇట్లు

హతభాగిని, పంకజ.

వుత్తరంచదివి ముగించి, ఒక దీర్ఘనిశ్వాసం విడిచింది నర్మద. వెంటనే జవాబువ్రాయాలని కాగితం, కలం తీసుకుని కూర్చున్నది కొంతసేపు ఆలోచించి మరీ జవాబు మొదలుపెట్టింది.

పంకజా, నీవురాసిన వుత్తరం అందింది. మొదట నీసంగతి మానాన్నతో నేరుగా చెప్పలేదు. పరోక్షంగాకదిపాను. ఆయన అభిప్రాయం తేలిపోయింది. నీవు ఆయనఅనివుంటాడన్నమాటలే అన్నారు. తరువాత నేనేమీ వాదించలేదు. ఇంకొకవారంలో నా అత్తవారింటికి ప్రయాణం నిశ్చయమైంది. నీ స్నేహాన్ని మాత్రం యెన్నటికీ మరచిపోను. యేవ్రేళయంవచ్చినా నీవు నీచదువునుమాత్రం మానవద్దు. దేవుడు తప్పకుండా నీకు మేలు చేస్తాడు. ఇట్లు

నీ శ్రేయోభిలాషిణి, నర్మద.

ఉత్తరం వ్రాసి కవరులో పెట్టి పనిమనిషికిచ్చి పోస్టులో పడేసిరమ్మని పంపి, తాను తండ్రిగదిలోకి వెళ్ళింది. వేంకటశేషయ్య పేపరుచదువుతూ, కూతురురావడం చూచి తల పైకెత్తాడు. పంకజరాసినవుత్తరాన్ని తండ్రికి చూపింది నర్మద అతడు వుత్తరం సాంతం చదివి,

"పురాకృతకర్మానుభూతి యెంతవారికీ తప్పదు తల్లీ! ఆమెదురవస్థకు సానుభూతిచూపడంతప్ప మనం చేసేదేమీ లేదు. పెండ్లయి, కాపురానికి వెడుతున్న పిల్లవు ఆమెతో తిరుగుతూంటే లోకం వూరుకోదమ్మా! నేను చెప్పవలసింది చెప్పాను. తరువాత నీయిష్టం" అన్నాడు, వుత్తరాన్ని నర్మద చేతికి అందిస్తూ.

"ఆమెహృదయాన్ని నీవు అర్థంచేసుకుంటే అంతేచాలు నాన్నా!" అంటూ గదిబయటకు వచ్చేసింది నర్మద.

## 5

స్కూల్ఫైనల్ పరీక్షాఫలితాలు జూన్నెల రెండవ వారం చివరలోగాని బయటపడలేదు. గృహపరిస్థితులవల్ల కలిగిన మనోవైకల్యంతో పరీక్షల్లో అనుకున్నంత తృప్తికరంగా రాయకపోవడంవల్ల పంకజ ఫస్టుక్లాసు తెచ్చుకోలేకపోయింది. మామూలు సెకండ్క్లాసులోనే వచ్చింది.

నర్మదకూడా సెకండ్క్లాస్లోనే ప్యాసైంది. నర్మదకు ఈ సంగతి తెలియజేయడానికి ఆమెఅడ్రసు పంకజదగ్గర లేదు. ఆమె అత్తవారియింటికి వెళ్ళిపోయాక ఆమెదగ్గరనుండి యెలాంటి వుత్తరమూ తనకు రాలేదు. తను నర్మదకు రాసినవుత్తరానికి

జవాబుగా ఆమె తనకు రాసిన వుత్తరమే ఆఖరివుత్తరం. అయినా, నర్మదకు పరీక్షాఫలితాలమీద అంత ఆసక్తి వున్నట్టు లేదు. ఉంటే తనకు ఆసంగతి వుత్తరంద్వారా తెలుపమని తప్పకుండా చెప్పివుండేదే అనుకున్నది పంకజ. కాని, తన ఆలోచన వెఱ్ఱిఆలోచన అని వెంటనే ఆమెకు తట్టింది. నర్మద తండ్రిగారు ఈవిషయం కూతురికి తెలియజేయకుండా వుంటాడా? అని మనసు కుదుటబరచుకుంది.

పంకజకు పైచదువువిషయం పెద్దసమస్యఅయికూచుంది. కనకాంగి? పంకజే ఓ పెద్దసమస్య. చేతికొచ్చినకూతురు ఇలా అందకుండాపోవడం చూసి, ఆమెమనసు విలవిలలాడిపోతోంది. అప్పను పాపం! రోజులుగడవడం కష్టమైపోతున్నప్పుడు కుల వృత్తివిషయంలో కనకాంగివాదనను కాదనడానికి వీల్లేదు. ఈ మాత్రం చదువుకే కూతురు గయ్యాళిఅయిపోయింది. ఇంకా పైకిచదివితే అడగాలా!

యేమైనా పంకజకు చదువుకుస్వస్తిచెప్పడం ఇష్టంలేదు. తల్లిని యేవిధంగానైనా వొప్పించాలని నిశ్చయించుకుంది. తనకు కాలేజీలో సీటుదొరికితే కనకాంగిని వొప్పించవచ్చునన్నధైర్యం ఉంది పంకజకు. మరొక ఆలోచనచేయకుండా నిజాంకాలేజిలో సీటుకోసం దరఖాస్తు పంపింది.

పంకజకు నిజాంకాలేజిలో సీటు దొరకలేదు. ఈసారి ఆడపిల్లలు అధికంగా వచ్చారు. ఇంటరు పూర్తిచేసి, మెడిసన్‌కు పోవాలన్న పంకజఆశలన్నీ నిరాశలైనై. తను చరిత్ర గ్రూపు తీసుకునేపక్షంలో సీటు యిప్పిస్తానన్నాడు ప్రిన్సిపాలు. కాని, తనకు కావలసింది బైయాలజీగ్రూప్. అసలు ఏ సైన్సు

సబ్జక్టులోను సీట్లు ఖాళీలేవు. తనకు యెల్లాగైనా వొకసీటు యిప్పించవలసిందని కన్నీళ్ళపర్యంతమై పంకజ ప్రిన్సిపాల్‌ను బ్రతిమాలుకుంది. కాని ససేమిరా అతడు లాభంలేదన్నాడు.

వల్లకాటిలో తాటిచెట్టు అన్నట్టు ఇంత పెద్ద నిజాం రాష్ట్రానికంతటికీ వొక్క నిజాంకళాశాలమాత్రమే నడుపబడు తోంది. అందులో సీట్లు చాలా తక్కువ. సైన్సుకు మరీనీ. అందులో ఆడవాళ్ళకు మరీ తక్కువని వేరే చెప్పనక్కరలేదు. ఉస్మానియా విశ్వవిద్యాలయం ఉర్దూప్రాధాన్యంగలది. ఉర్దూ నేర్వనివిద్యార్థులు పైచదువుకోసం బయటివూళ్ళకు వెళ్ళ వలసిందే.

పంకజ యేడ్పుముఖంతో యింటికి తిరిగివచ్చింది. తను డాక్టరీ చదవడంమాటేమిటి? అసలు ప్రపంచంలో తనగతేమిటి? యెక్కడన్నా పంతులమ్మవుద్యోగం చూసుకోవడమా? ఈ సంగతి తలచుకుంటేనే యెందుకో ఆమెమనసు భయంతో వణకిపోయింది. దానికి కారణం తాను కనకాంగికూతురుకావ డమే. యెంత ప్రయత్నించినా తను కాలేజిలోచేరాలన్న తీవ్ర మైనవాంఛ ఆమె మనస్సులోంచి తొలగించుకోలేకపోతోంది. ఆలోచనాసాగరంలో కొట్టుకుంటున్న ఆమెకు హఠాత్తుగా గుంటూరుకాలేజీ స్ఫురణకువచ్చింది. మద్రాసు చాలాదూరం. గుంటూరైతే దగ్గరలోనే వుంది.

కాని, కనకాంగి యిందుకు వొప్పుకుంటుందా? ఇక్కడే నిజాంకాలేజీ అయితే యేదోవిధంగా ఆమెను వొప్పించిచదవ వచ్చు. వూరువిడిచివెళ్ళడానికి తల్లి సుతరామూ వొప్పుకోదు. ఈసంగతి పంకజకు బాగా తెలుసు. అయినా, అడిగిచూద్దా

మని నిశ్చయించుకుంది. తనగదిలోకి యేదోపనిమీద వచ్చిన కనకాంగిని పరిశీలించి చూచింది పంకజ. కూతురు తన నెందు కంత తేరిపార చూస్తున్నదో కనకాంగికి అర్థంకాలేదు. ఆమె గదిలోంచి వెళ్ళిపోబోతూండగా పంకజ "అమ్మా!" అని పిలిచింది.

"ఏమమ్మా!" అని వెనుదిరిగింది కనకాంగి. కూతురికి కాలేజీలో సీటు దొరకలేదన్న సంగతి తెలిసి చాలా సంతోషంగా వుంది కనకాంగికి. యింక యేనాటికైనా తనకులొంగక పోతుందా అన్న ధైర్యం కలుగుతోంది ఆమెకు. పంకజ యేం చెబుతుందో అని యెదురుచూస్తూ నిలబడింది పంకజ ఒక్క క్షణం ఆగి, నోట్లోనీళ్ళుమింగుతూ—

"నీదగ్గర యేపాటిడబ్బువుంది?" అని ప్రశ్నించింది.

కూతురినోటినుండివచ్చిన యీ మాటలువిని వెళ్ళిపోయింది కనకాంగి. అయినా తన డబ్బుసంగతి యీమె కెందుకు?

"ఎంతవుంటే నీకెందుకు?" అన్నది విసురుగా కనకాంగి.

"అదికాదు. గుంటూరువెళ్ళి కాలేజిలో చేరుదామను కుంటున్నాను." అన్నది పంకజ తల్లిముఖకవళికలు పరీక్షిస్తూ ఈమాటలకు కనకాంగిశరీరపుకనకచ్ఛాయ అగ్నిసంపర్కంకలిగి నట్లు యెఱ్ఱబారిపోయింది. బుస్సుమని పంకజమీదికి లేచింది. "గుంటూరేవెడతావో, గోదావరిలోదూకుతావో నాకెందుకు? యింక నీచదువుకోసం పొక్కటోలీ యివ్వను. పొక్కపైసా సంపాదించడానికి యోగ్యతలేదు గాని, చదువులుసాగిస్తుందట

చదువులు! సిగ్గులేకపోతే సరి..." అంటూ నాగుపాములా లోపలికి వెళ్లిపోయింది.

పంకజఆశలన్నీ కుప్పకూలిపోయినై. ఆమెకు తెలియకుండానే ఆమెకాళ్ళు ఆమెను నాటిసాయంకాలం హుస్సేన్ సాగర్ చెరువువద్దకు తీసుకువెళ్ళినై.

హుస్సేన్‌సాగర్ హైదరాబాదుకు సికింద్రాబాదుకు మధ్యలోవున్న వొక విశాలమైన సరోవరం. ఈ చెరువుమధ్య కట్టమీదుగావెళ్లేరోడ్డు ఈచెరువువిడదీసే రెండునగరాలను కలుపుతోంది. ఈ చెరువువయసు సుమారు నాలుగువందల సంవత్సరాలు.

పంకజ మోకాలిబంటినీళ్ళలో నిలబడింది. పొద్దుగ్రుంకి చాలాసేపైంది. చీకట్లుకమ్ముకొస్తున్నై. రోడ్డుమీద వెలిగించిన దీపాలు దూరంగా కనుపిస్తున్నై. పంకజ ఆలోచిస్తోంది. పరీక్షలుతప్పిపోయిన విద్యార్థులను, అత్తలు, ఆడబిడ్డలపోరుపడలేని ఇల్లాండ్రను, గర్భందాల్చిన వితంతువులను, కన్యలను, తనలో లీనంచేసుకుని వారికష్టాలనుతీర్చిన సరోవరమే నేడు తనకూ శరణ్యమౌతోంది. ఇంక వొక్కక్షణంలో తానీ కష్టమయ ప్రపంచాన్ని శాశ్వతంగా విడిచి, హాయిగా యేలోకానికో వెళ్ళిపోవచ్చు.

నీళ్ళలో యింకా కొంతలోతుకు వెళ్ళింది. నిశ్చలమైన నీటిలో నక్షత్రాలు ప్రతిబింబిస్తున్నై. మసకగాకనుపించే తన నీడను నీటిలో వొకసారి చూసుకుంది. హఠాత్తుగా నిలబడిపోయింది. యెందుకో ఆమెకు యెక్కడాలేని నవ్వువచ్చింది. యేమిటి తనుచేస్తున్నపని? ఆత్మహత్యా? ఇంతకంటే ఘోర

మైనపాపం మరొకటి వుందా? చావడానికి యిన్ని మార్గాలున్నప్పుడు బ్రతకడానికిమాత్రం యెందుకు వుండవు? దానిని అన్వేషించడం చేతకాక ఆత్మహత్యచేసుకోవడమా?

ఆమె మెల్లిగా నీటిలోంచి బయటకు వచ్చేసింది. అతి దుఃఖంవల్లకలిగిన మనోవైకల్యంతో తన కీ ఆత్మహత్యచేసుకోవాలనే ఆలోచన కలిగిందని ఆమె గ్రహించింది.

రోడ్డుమీద యెవరూ తనను గమనించకుండా యిల్లు చేరుకుంది పంకజ.

కనకాంగి యింట్లోనే వుంది. సగంతడిసినచీరతో ఇంటికి వచ్చినకూతుర్ని చూచి, కనకాంగి యేదో గ్రహించింది. ఆమెకు కడుపుతరుక్కుపోయింది. కళ్ళలో నీళ్ళుతిరిగినై. ఇంక అక్కడ నిలవలేక చటుక్కున లోపలికివెళ్ళిపోయింది.

పంకజ తనగదిలోకివచ్చి చీరమార్చుకుంది. యింకా మనసు అదోమాదిరిగా వుంది. ఆకలికూడా లేదు. మంచం మీద చేరబడి, విశ్వనాథవారి "చెలియలికట్ట"తీసుకుని పేజీలు తిరగవేయడం మొదలుపెట్టింది. కనకాంగి గదిలోకి వచ్చింది. బాగా యేడ్చినట్టు ఆమెముఖం వాచిపోయివుంది. ఆమె యెందుకు తనగదిలోకివచ్చిందో పంకజకు అర్థంకాలేదు.

"కన్నపాపానికి నా ఋణం యేదో తీర్చుకుంటాను. గుంటూరుకాలేజిలో సీటుదొరికితే వెళ్ళి చదువుకో. నెలకు యెంతకావాలో అంతా పంపిస్తాను. సరేనా. ఇంక లే భోజనానికి" అంది. పంకజకు యెక్కడలేనిసంతోషం కలిగింది. "అమ్మా!" అంటూ తల్లినికౌగలించుకుంది.

ఇద్దరూకలసి భోజనానికి వంటింట్లోకి వెళ్ళారు.

# 6

రెండుసంవత్సరాలు గిర్రునతిరిగిపోయినై. ఈ రెండు సంవత్సరాలు పంకజ గుంటూరులోనే గడిపింది. గుంటూరు కాలేజిలో సీటుదొరకడం ఆమె కంత కష్టమనిపించలేదు. కాలేజిలోచేరినతరువాత చదువుమీాద ఆమె దృక్పథంలో చాలా మార్పువచ్చింది. తను యింతకాలమూ అనుకున్న దానికన్నా ప్రపంచం చాలా విశాలమైందనీ యింతకాలమూ తను చదివింది యేమంత గొప్పచదువు కాదనీ, అది పైచదువుకు కేవలం మెట్టుమాత్రమేననీ, యింకా ప్రపంచంలో తాను తెలుసుకోవలసిన విషయాలు చాలా వున్నాయనీ ఆమె గ్రహించింది.

పంకజ హాస్టల్లో చేరలేదు. ఒకగది ప్రత్యేకంగా అద్దెకుతీసుకుని అందులో వుంది. హోటలునుంచి భోజనం తెప్పించుకునేది.తనుయింటరువూర్తిచేయటానికికష్టపడిచదవటం మాట అల్లావుంచి, తాను గుంటూరులోవుండి చదువుసాగించడానికి నెలనెలా తప్పకుండా తనఖర్చుకుసరిపడేటంతడబ్బు కనకాంగి, తాను అన్నమాటతప్పకుండా పంపుతూండడంవల్లనే అని పంకజ గ్రహించింది.

పంకజ తనకులంసంగతి యెవ్వరితోను చెప్పకోలేదు. అందరూ తనకులవృత్తినెరిగిన సికింద్రాబాదువాతావరణం లోంచి బయటపడటం మొదట ఆమె కెంతో సంతోషాన్ని కలుగచేసింది. కాలేజికి అప్లికేషను మొదలైనవాటిల్లో కులాన్ని గురించి చెప్పవలసినచోట, కేవలం బ్రాహ్మణేతర అనే రాసింది. అసలు తనకులంప్రసక్తి గుంటూలో అనవసరమైన

విషయం. కాని, తాను వేశ్యావృత్తికి చెందినదని కాలేజిలో క్లాసు చేరిన కొద్దికాలానికే అందరికీ తెలిసిపోయింది. తనతో స్కూల్ ఫైనల్ వరకు సికింద్రాబాదులో చదువుకున్న లీల అనే అమ్మాయికూడా అక్కడ కాలేజిలో చేరింది. ఆమె పనిగట్టుకుని, విద్యార్థినులందరితోను పంకజసంగతి చెప్పేసింది. అది ఆనోట ఆనోట విద్యార్థులకుగూడా తెలిసిపోయింది. లీల కేవలం పంకజసంగతి బయటపెట్టడానికే గుంటూరులో అవతరించినట్టు, ఆరునెలలుకాగానే ఆమెతండ్రి కేవో యిబ్బందులుకలిగి ఆమె కాలేజిమానేసి వెళ్ళిపోయింది.

పంకజ క్లాసులో లెక్చర్లు వినడమేమో, నోట్సుతీసుకోవడమేమో అంతేగాని, యితరులతో – మరీఅవసరమైతేతప్ప మాటలుపెట్టుకునేదికాదు. కాలేజి, తనగదీ తప్ప గుంటూరులో మరోచోటు యెరుగదామె.

నిజానికి పంకజ అంత చక్కనిపిల్ల ఆకాలేజిలో నేకాదు ఆ వూళ్ళోనే లేదని చెప్పాలి. ఆమె ఫలానికులానికి చెందినదని తెలిశాక విద్యార్థులకు ఆమెనుచూచి మనసుకలిగినా, సాహసించి యెవరూ ఆమెదగ్గరకు రాలేకపోయారు. చాటున అపహాశ్యనగా మాట్లాడుకున్నా యెదురుగా యేమనడానికి యెవరికీ ధైర్యంచాలదు. వొక్క సత్యనారాయణ అన్న బి. ఏ. మొదటిసంవత్సరం విద్యార్థిమాత్రం వొకనాడు పంకజ యేకాంతంగా తటస్థపడటంచూచి, ఆమెచెయ్యి పట్టుకున్నాడు. పంకజకు పట్టరానిఆగ్రహం కలిగింది. లాగి వొక లెంపకాయ యిచ్చింది. అతడు మారుమాటాడకుండా వెళ్ళిపోయాడు.

సత్యనారాయణకి సాధారణంగా వశంకాని వేశ్యలంటూ

లేరు. గుంటూరులో అతడు తొక్కని సానిగడపఅంటూ లేదు. వొక వేశ్య లేగాదు. అతనిజాణతనానికి. వొకరకంగా స్త్రీ కులీనకుటుంబాలలోని జారిణులు యిట్టే వశపడిపోతారు. పంకజ లొంగకపోదన్న ధైర్యంతోనే అతను ఆమె చెయ్యి పట్టుకున్నాడు. కాని, వ్యవహారం యెదురుతిరిగింది. ఆనాడు కలిగిన పరాభవంతో సత్యనారాయణ మళ్ళీ పంకజజోలికి పోలేదు.

సత్యనారాయణసంఘటనతో పంకజ యినుమడించిన ధైర్యంతో ఉంటోంది. నిర్భయంగా సంచరిస్తున్న నాతావరణం మళ్ళీ ఆమెకు నిర్భరమైపోయింది. మనస్సును చదువుమీదకన్నా శీలరక్షణమీదే యెక్కువగా కేంద్రీకరించవలసివస్తోంది.

తరువాత యే విద్యార్థీ తనను సమీపించలేదు. కాని, క్లాసులో తనకుయెదురుగాకూర్చున్న శర్మ అన్న విద్యార్థి సర్వము మరచి, తదేకదృష్టితో తననేచూస్తుండడం రోజూ గమనిస్తూనేవుంది. అతనిదృష్టికి ఆమె హృదయం చెదరకపోయినా, అప్రయత్నంగా అతనిని నిత్యము గమనించడం మాత్రం జరుగుతూనేవుంది.

ఒకరోజున కాలేజినుంచి తిరిగివస్తూండగా అతను పంకజను సమీపించాడు. చాలా సంకోచపడుతూ పంకజవైపు చూచాడు. యేదో అడగాలని ప్రయత్నిస్తూ సిగ్గుపడుతున్నట్టు గ్రహించింది పంకజ. మెల్లగా అతనిమొహంలోకి చూచి నవ్వుతూ తానుకూడా మౌనంగానే వుండిపోయింది.

"వొకసారి మీ యింగ్లీషునోట్సు యిస్తారా? కాపీ చేసుకుని మళ్ళీ యిచ్చేస్తాను" అన్నాడు. ఆమాటలు అనేసిన తరువాత అతనిముఖంలో ఏదో భారం దిగిపోయినట్టనిపించింది.

యింతమంది విద్యార్థు లుండగా యితడు తననే యెందు కడగాలి ? అతనిమనసులో తనయందు యేదో వుద్దేశం వుండి వుండాలి. పంకజకు కాస్త కోపంవచ్చినా, అతను తనవుద్దేశాన్ని బయటపెట్టకుండా తనేమీ అనకూడ దనుకుంది. అతనడిగిన దానికి నేరుగానే జవాబు చెప్పింది.

"క్లాసులో చిత్తు వ్రాసుకున్నానేగాని, సాపు వ్రాసుకో డానికి తీరికలేదు. వ్రాశాక తప్పకుండా యిస్తాను" అంది.

శర్మ ఇంకేమీ మాట్లాడలేదు.

కొంతకాలమైనతరువాత మళ్ళీ వొకరోజున శర్మ తటస్థ పడ్డాడు. పంకజ అనుకున్నట్టుగా ఈసారి అతను నోట్సు అడగ లేదు.

"నే నొకవిషయం అడుగుతాను నిజంచెబుతావా ?" అన్నాడు.

"ఏమిటది ?" అన్నది పంకజ అతనిముఖంలో యేదో సంకోచాన్ని గమనిస్తూనే.

"పంకజా ! నీవు నిజంగా వేశ్యవా ?..." అన్నాడు శర్మ పొంగిపొరలివచ్చే వుద్రేకంతో. ఇతని కీ ప్రశ్న వేయవల సినఅవసరం యేంవచ్చింది ? అతనిమనస్సులో తననుగూర్చి యేదో తీవ్రమైనఆవేదన వుండివుండాలి. లేకపోతే తన నీవిధంగా ప్రశ్నించడు.

"కాను......"అన్నది పంకజ ముక్తసరిగా.

"మరి అందరూ నిన్ను వేశ్యఅని యెందుకంటారు?" అన్నాడు మళ్లీ.

"అవును......" అన్నది పంకజ నిట్టూరుస్తూ.

"నీసంగతి నా కర్థంకావడంలేదు" అన్నాడు శర్మ.

"అవును, నాసంగతి మీా కర్థంకాదు. ఈవిషయం మీా కనవసరం—మీారు ఆర్చేదీకాదు, తీర్చేదీకాదు—నావిష యమై మీారు బాధపడకండి; మీా పనేదో మీారు చూసు కోండి" అంటూ వెళ్లిపోయింది పంకజ తనగదికి. తరువాత శర్మ తన నేమీా అడగలేదు.

మొదటిసంవత్సరం పరీక్షలు పూర్తిఅయినాక, వేసంగి శలవులకు సికింద్రాబాదుకు వచ్చి మళ్ళీ గుంటూరువెళ్లింది పంకజ. ఇక్కడ కనకాంగికి రోజులు చాలా గడ్డుగాగడుస్తున్నై. అసలే రాబడి తగ్గిపోయినవ్యాపారం ఆమెది. నెలనెల దోసి ళ్ళతో పోసినట్టు కూతురుఖర్చులకు డబ్బుపంపడం అంటే మాటలా? అయినా, ఆమె తనమాట నిలబెట్టుకుంటూనేవుంది. పంకజకు రెండవసంవత్సరం చదువుకూడా సాఫీగానే సాగు తోంది.

మళ్లీ వొకనాడు పంకజకు శర్మ తారసిల్లాడు. మళ్లీ యింగ్లీషునోట్సు అడిగాడు. పంకజకు నవ్వువచ్చింది. కాని నోట్సు యిచ్చింది. అతడు నోట్సుఅందుకుంటూ తదేకదృష్టితో పంకజముఖంలోకి చూస్తూ నిలబడ్డాడు. అతనిఅంతస్సులోని ఆవేదన అతనికళ్ళల్లో ప్రతిఫలిస్తూండడం పంకజ కనిపెట్టింది.

"నా సందేహం యెందుకు తీర్చవు?..."అన్నాడు శర్మ.

"యే సందేహం?..."

"నీవు నిజంగా వేశ్యవా?..."

"అవును..."

"నాకు నమ్మకంలేదు. సాని కీ చదువెందుకు...?"

తననుగూర్చి యింత ఆవేదనపడుతున్నవ్యక్తితో తన సంగతిచెపితే తప్పేముంది? అనుకున్నది.

"నే నొక వేశ్యకూతుర్నే. కాని ఆ జీవితం నా కిష్టం లేదు. అందుకని చదువుకుంటున్నాను" అన్నది పంకజ.

అత నేమీ మాట్లాడలేదు. మొదలకుండా వెళ్ళి పోయాడు.

రెండవసంవత్సరంచదువు పూర్తికావచ్చింది. తాను కష్టపడిచదివినదానికి ఫలితంగా పరీక్ష పేపర్లన్నీ చాలా తృప్తి కరంగా రాసింది పంకజ.

ఆమె తిరిగి సికింద్రాబాదు ప్రయాణానికి సిద్ధమౌతు తున్నది. శర్మ ఈసారి ఆమెగదికే వచ్చాడు. అతన్ని ఆహ్వానించాలో, బయటకుపొమ్మనాలో తెలియక తటపటా యించింది పంకజ.

"మీ వూరికి ప్రయాణమా?..." అన్నాడు.

"అవును..."

"మళ్లీ గుంటూరు రావడం యెప్పుడు...?"

"మళ్లీ యిక్కడికి వస్తానన్ననమ్మకంలేదు..."

"మరి నీ ప్లానేమిటి?"

"నా వుద్దేశాలకీ, నాజీవితానికి లంకెకుదరదు. దేని దారిదానిదే..."

"నే నడిగింది నీ వుద్దేశమేమిటని మాత్రమే..." అన్నాడు నవ్వుతూ శర్మ. పంకజకూడా నవ్వింది.

"మెడిసన్ చదవాలని. కాని నా కది పీలుపడుతుందను కోను"

"పోనీ, బి.ఎస్‌సి. చదవకూడదూ? వృత్తి యింటరు యెందుకూ పనికిరాదు" అన్నాడు శర్మ.

"యే చదువైనా డబ్బుమీద ఆధారపడివుంది. యింక పైచదువుకు నాకు కావలసినంతధనసహాయం లభిస్తుందన్న ఆశ నాకు లేదు" అంది పంకజ. ఆమెకు తనకాంగిస్థితిగతులు యిప్ప టికి బాగాఅర్థమైనాయి. శర్మ పంకజముఖాన్ని కొన్నిక్షణాల పాటు పరిశీలనగా చూస్తూ కూర్చున్నాడు.

"నీకు వివాహంచేసుకు నేవుద్దేశం వున్నదా?" అన్నాడు సంకోచిస్తూ. వివాహం! ఆ మాట యెవరో చెవులదగ్గరగా వీణవాయించినట్లనిపించింది. ఒక ఆంగ్లకవి అన్నట్లు, వివాహం స్వర్గంలో జరుగుతుంది. కాని జీవితం భూమిమీద గడపాలి. తనజీవితం ముళ్ళబాటలోవున్నదన్నమాట స్ఫురణకు రాగానే పంకజశరీరం కంపించినట్లయింది.

"నేను వుద్దేశపడిమాత్రం యేం ప్రయోజనం? నన్ను వివాహంచేసుకోదలచినవాడు ధనవంతుడు, సాహసికుడూ అయి వుండాలి. లేకపోతే ఈ సంఘంలో బ్రతకడమే దుర్భర మౌతుంది..." అన్నది పంకజ. తనవివాహవిషయమై యింత గంభీరమైనవ్యాఖ్యానం చేయగలిగినందుకు తనలో తనకే సంతోషం కలిగింది.

"నా కా ధైర్యం వున్నది. నేను నిన్ను వివాహమాడు తాను..." అన్నాడు వుద్రేకంతో శర్మ పంకజముఖంలోకి చూస్తూ.

"మీరు ప్రదేశంతో అంటున్నారు. నిదానంగా ఆలోచించండి. మీరింకా మీ తలిదండ్రులఅధీనంలోనే వున్నారనుకుంటాను. మీవారు ఈ వివాహానికి అంగీకరించరనేది అక్షరాలా నిజం. తరువాత మీ గతి ఆలోచించండి ముందు మీ చదువు పూర్తికానివ్వండి. పెద్దవుద్యోగం సంపాదించుకున్న తరువాత మీ పెండ్లివిషయం ఆలోచించుకోవచ్చును. యెంతవరకైనా చదువుకోడానికి మీకున్న అవకాశాలను యెందుకు పాడుచేసుకుంటారు——?" అన్నది పంకజ.

"నేను నిన్ను మనసారా ప్రేమిస్తున్నాను పంకజా! నన్ను వివాహమాడుతానని మాటయివ్వు, నీవుచెప్పినట్టే చేస్తాను..." అన్నాడు శర్మ.

"ఈవిషయంలో నన్ను కాస్త ఆలోచించుకోని..." అన్నది.

శర్మ వెళ్ళిపోయాడు. మళ్ళీ సాయంకాలం ఆమె రైలుకు బయలుదేరేముందు ఆమెగదికి వచ్చాడు.

"ఏమంటావు?" అన్నాడు.

పంకజ వొక్కసారి శర్మను క్రిందినుంచిపైవరకు పరిశీలనగా చూచింది.

"మీరు నిజంగా నన్ను పెళ్ళాడుతారా...?" అంది.

"అవును. తప్పకుండా..." అన్నాడతడు ప్రదేశంతో.

పంకజ క్షణంకాలం ఆలోచించింది. అతణ్ణి మళ్ళీ పరిశీలనగా చూచింది. విశాలమైనవక్షం, యెత్తైనభుజాలు, అరటిమొగ్గలా కోలముఖం, తళతళ మెరిసే చక్కనికళ్ళు. మల్లులాల్చీ, ధోవతి ధరించి, యెంతో ఆకర్షణీయంగా వున్నాడు.

తనకంటే వయసు రెండుమూడుసంవత్సరాలకంటె యెక్కువ వుండదు. అన్నివిధాలా తనకు జోడైనవాడే. "మీ పేరో, యేవూరివారో కూడా నే నెఱుగను. అయినా, నా హృదయంలో మీకు తప్ప మరెవ్వరికీ చోటివ్వను. మీరు చదువు పూర్తిచేసి, వుద్యోగంలో ప్రవేశించి, నాకోసం వచ్చేంతవరకు మీకోసం నేను యెదురుచూస్తుంటాను" అన్నది నిశ్చలంగా అతనికళ్ళలోకి చూస్తూ. శర్మ మౌనంగా వింటూ ఆమెకేసి చూస్తున్నాడు. కొన్నిక్షణాలు గడిచినతర్వాత "మీవూరు సికింద్రాబాదా...?" అని అడిగాడు.

"అవును" అంది పంకజ.

"అక్కడ నీ అడ్రసు?" అన్నాడు శర్మ.

"మా అమ్మపేరు కనకాంగి. అక్కడికివచ్చినప్పుడు కనకాంగియిల్లెక్కడ అంటే యెవరైనా చెబుతారు..." అంది పంకజ నవ్వుతూ.

"ఐతే ఆ వూళ్లో మీ అమ్మపేరు అంత ప్రసిద్ధిఅన్నమాట?" అన్నాడు శర్మకూడా నవ్వుతూ.

శర్మదగ్గర సెలవుపుచ్చుకుని, పంకజ బండియెక్కింది. పంకజ వొక నవవికాసంతో, నూతనోత్సాహంతో, పుష్పసముజ్జ్వలమైన వసంతశోభతో మళ్ళీ సికింద్రాబాదు చేరుకుంది.

కూతుర్ని చూచేటప్పటికి కనకాంగికి యెక్కడలేని సంతోషం కలిగింది. కనకాంగిస్వరూపంలో యెలాంటిమార్పూ లేదు. హఠాత్తుగా చూచినవారు ఆమె నవయువతిఅనే అనుకుంటారు. అయినా, ఆమెకు ముసలితనం మీదపడుతోంది.

పంకజను యెంతో ఆప్యాయంగా యింటికి ఆహ్వానించింది. ఇప్పటికైనా కూతురు తనదారికివస్తుందా? యేమో! ప్రయత్నించిచూడాలి!

# 7

ప్రవాహంలా దొర్లుకుపోయేకాలంలో మరొక మూడు నెలలు గడ్డిపరకల్లా కొట్టుకుపోయినై.

ఆ మూడు నెలలూ పంకజహృదయం మధురస్మృతులతోనే నిండివుంది. ఆమె ఆలోచనలన్నీ శర్మనుగురించే. శర్మ వస్తాడు. తనను వివాహమాడుతాడు. ఇవే ఆమెతలంపులు. ఆమె చుట్టూవున్న సంఘాన్ని పూర్తిగా విస్మరించింది. యే లోకంలోవున్న సంగతీకూడా తెలియదు. ఆమెస్థితి జాగ్రదవస్థలో సుషుప్తి. సుషుప్తిలో జాగృతి. యెప్పుడో తల్లి జ్ఞాపకంచేస్తే స్నానంచేస్తుంది, భోంచేస్తుంది. లేకపోతే వాటిధ్యాసకూడా లేదామెకు.

ఈ ప్రపంచంలో తనుకూడా ఒకనికి భార్యకాబోతున్నది. తను కలలోకూడా యింతకాలం ఊహించుకోలేని మహాభాగ్యం తనకు కలుగబోతున్నది. తనకూ సంఘంలో గౌరవంగా బ్రతికేరోజులు వస్తున్నై. ఈ అవినీతికూపంలోంచి బయటపడి, నీతిపథంలో నడిచే సదవకాశం తనకు శర్మ కలిగించబోతున్నాడు.

పంకజ నీతిగురించి ఆలోచించింది. తాను అవినీతిలోనే పుట్టింది. అవినీతివాతావరణంలోనే పెరిగింది. తనతల్లి అవినీతితో సంపాదించినడబ్బుతోనే తా నింతవరకు చదువు

సాగించింది. నీతిగా బ్రతకడంకోసం తాపత్రయపడుతోంది. ఇందు లోయేది నీతి, యేది అవినీతి? అవినీతిలోనుంచే నీతి పుట్టిందా? యేమో! నీతినిగురించి ఆలోచించినకొద్దీ, ఆమెతల తిరిగిపోయి నంతపనిఅయ్యేది. నీతి, అవినీతులమధ్య ఆమె యెంత ఘర్షణ పడినా శర్మ తనను చేపట్టేవరకు తను తనతల్లి అవినీతిసంపాదన మీదనే ఆధారపడకతప్పదు.

శర్మ తనను నిజంగా పెళ్ళాడుతాడా? యేమో! తలి దండ్రులచాటువాడు. అతనిచదువు పూర్తిఅయ్యేలోపల అత నిలో యెన్నిమార్పులు వస్తాయో! అతను పెండ్లాడనిపక్షంలో తనగతేమిటి? పీడకలవలె ఇటువంటి ఆలోచనలువచ్చినప్పుడు ఆమెశరీరం కంపించేది. శర్మ తనను తప్పకుండా పెళ్లాడుతాడని ఆమెఅంతరాత్మ ఆమెకు ఎనలేనిధైర్యం చెప్పేది. ఇలాగే మూడునెలలు గడిచినై.

ఒకనాటిసంధ్యవేళ పంకజ తనగదిలో కూర్చుని, ఆలో చిస్తూండగా, శర్మ ప్రత్యక్షమైనాడు ఆమెయెదుట. ఆమెకు అప్పుడు తానున్నది యథార్థస్థితిలోనో స్వప్నావస్థలోనో తేల్చు కోడానికి కొన్నినిమిసాలుపట్టింది. తాను కలకనడంలేదు. శర్మ తన కెదురుగావున్నది యథార్థమే. కాని, అతను యెప్పుడు వచ్చాడు? యెట్లా వచ్చాడు? యేమో! ఆమె కంతా అయోమయంగా వుంది. శర్మ తనను రెప్పవాల్చకుండా చూస్తూ నిలబడివున్నాడు.

యెంత మారిపోయాడు మనిషి! ఈ మూడు నెలల్లోను నిద్రయెరుగనట్టు అతనికళ్ళు లోపలికి దించుకుపోయివున్నై. మొహం వడతగిలినట్టు వాడిపోయివుంది. శరీరం నిండుదనం

కోల్పోయి, చిక్కిపోయినట్టు కనుపిస్తోంది. కాంతిలేనికళ్ళల్లో యేదో ఆవేదనమాత్రం స్పష్టంగా ద్యోతకమవుతోంది.

అతని ఈ స్థితికి కారణం? పంకజ వూహించుకోలేక పోయింది.

కనకాంగి గదిలోకివచ్చింది వొక వెండిపళ్లెంలో కొన్ని పండ్లూ, ఆకులూ, వక్కపొడీ, పన్నీరుబుడ్డీ, వొకమరచెంబులో పాలు తెచ్చి అక్కడ బల్లమీదపెట్టి, యిద్దరినీచూచి ముసిముసినవ్వులతో వెడుతూ, గదితలుపులు మూసి వెళ్ళిపోయింది. పంకజకు ఏదో గ్రంథం జరిగివుంటుందని బోధపడింది. ఇదంతా తనతల్లిపన్నాగం. యెవడో విటుడనుకుని శర్మను ప్రవేశపెట్టింది-ఇతడు శర్మకాబట్టి సరిపోయింది. మరెవడైనా అయివుంటే? తననుకులవృత్తిలోకి దింపేప్రయత్నం కనకాంగి యింకా మానలేదన్నమాట. ఇలా ఆలోచిస్తూనే "శర్మా...!" అన్నది అప్రయత్నంగా.

"అవును, పంకజా! ఇంక నీకుదూరంగా వొక్కక్షణం కూడా వుండలేను" అన్నాడు శర్మ దీనంగా.

పంకజ లేచి అతణ్ణి తనమంచంమీద కూర్చోపెట్టింది. అతనిముఖాన్ని తనరెండుచేతుల్లోకి తీసుకుని, అతనికళ్ళల్లోకి గుచ్చిగుచ్చిచూస్తూ అతనిముఖంమీదికి వంగి, అతని పెదవులతో తనపెదవులను కలుపబోయి, యెందుకో హఠాత్తుగా వెనుకకుతగ్గింది. తనఉద్రేకానికి తనే నవ్వుకున్నది.

"నామనస్సులో నీకు తప్ప మరెవ్వరికీ తావివ్వనని చెప్పానుకదూ. నామాటలమీద నమ్మకంలేదా?" అన్నది కాస్త వెనక్కుతగ్గి నిలబడి.

"ఉన్నది. కాని..." అన్నాడు శర్మ.

"మరి యిప్పుడు దేనికివచ్చినట్టు? ఈదేహంకోసమా? మనసు నీదైనప్పుడు ఈ శరీరంమాత్రం నీదికాదా? ఒకవస్తువు నీదేనని తెలిసినప్పుడు, ఆవస్తువును అనుభవించడానికి కాస్త కాలవిలంబనాన్ని సహించుకోలేవా?" అన్నది పంకజ అతని ముఖంలోకి చూస్తూ. శర్మ వెంటనే జవాబుచెప్పలేక పోయాడు. అతనిశరీరం జ్వరంరావడానికి కొన్నిక్షణాలముందు ఉండేస్థితిలో వుంది. అతనిపెదిమలు యింకాస్పందిస్తూనేవున్నై. గుండెకూడా వేగంగా కొట్టుకుంటోంది. అతనిప్రవర్తన పంకజ కెంత విపరీతంగా కనిపిస్తోందో, పంకజప్రవర్తనకూడా అతని కంతవిపరీతంగాను కనిపిస్తోంది. వొక్కక్షణం ఆగి—

"నిన్నుచూడకుండా యింక జీవించలేననిపించింది" అన్నాడు.

"నీమనస్సుకు కష్టంకలిగించడం నా మతంకాదు శర్మా. నన్ను రేపే వివాహంచేసుకో. నేను సిద్ధంగా వున్నాను. వైదిక పద్ధతో, బ్రహ్మసామాజికమో, ఆర్యసామాజికమో లేక యింకా యేపద్ధతినైనాసరే నాకు సమ్మతమే. నలుగురిముందు నన్ను నీ భార్యగా స్వీకరించు. అదే నాకు కావాలి. నేను నీకు భార్యగా యెన్నికష్టాలనైనా భరిస్తాను. కాని యీ సంఘంలో నాకు, నాకుకలుగబోయేసంతానానికీ వొకస్థానం కావాలి. నేను యింతకాలం పడినబాధ నాపిల్లలుపడకూడదు. అంతే నాక్కావలసింది. నామనసులోనిబాధ నీ కర్థంకావడం లేదా శర్మా..."అన్నది పంకజ. చివరిమాటలు అంటూవుంటే ఆమెకంఠం రుద్ధమైంది. కళ్లు చెమ్మగిల్లినై.

శర్మ ఆమెమాటలు వింటూ ఒకక్షణం ఆలోచించాడు.

"మనవివాహానికి యేర్పాటుచేస్తాను, సరేనా ?" అని లేచాడు వెళ్ళిపోయేవుద్దేశంతో. ఇంక అక్కడ నిలవడం అతనికి కష్టసాధ్యమనిపించింది.

"నీ విప్పుడు అవతలికి వెళ్ళలేవు. మా అమ్మ బయట గొళ్ళెం పెట్టింది—" అంది పంకజ.

"మరి......?"

"నీకోసం యెదురుచూచేవాళ్ళు యెవరూ లేకపోతే, ఈరాత్రికి యిక్కడే వుండిపోవొచ్చు" అన్నది అతనితో ఇంకా యేమో వెళ్ళబోనుకోవాలని. యెందుకో అతనిమనస్సుకూడా వెనక్కులాగింది మళ్ళీ.

అత నేమీ జవాబు చెప్పలేదు. వచ్చి మంచంమీద కూర్చున్నాడు. పంకజ అతనికి అరటిపళ్ళు, బత్తాయి వొలిచి యిచ్చి, తినుమన్నది. అతడు తిన్నాడు. తానుకూడా తిన్నది. మరచెంబులోపాలు యిద్దరూ చెరికాసిని తాగి, వొక్కపొడి వేసుకున్నారు. తరువాత పంకజ శర్మను కాస్త లేవమని, పరుపు అడుగున పరచివున్న జంఖానా యివతలికి లాగి, కింద పరుచుకున్నది. తనకున్న రెండుతలగడలలో వొకటి తను తీసుకొని, రెండవది శర్మకు ఉంచింది. అతణ్ణి మంచంమీద పడుకో మన్నది.

"మాఅమ్మ నిన్ను డబ్బు అడగలేదా?" అంది పంకజ.

"అడిగింది. కాని, నిన్నుచూడాలన్న ఆతురతలో ఆమె మాటలు వినిపించుకోకుండానే లోపలికి వచ్చేశాను" అన్నాడు శర్మ.

"నీవు నన్నెరుగుదువని ఆమెకు తెలియదు. యెవరో విటుడనుకుని లోపలికి వదిలింది. ఇక్కడ యిట్లా వుంది నా బ్రతుకు. నన్ను వృత్తిలోకిదింపడానికి మాఅమ్మ చేస్తున్న ప్రయత్నాలు యిన్నీ అన్నీ కావు..." అంది పంకజ.

శర్మ ఆమెమాటలు వింటున్నట్టులేదు. పడుకుని పైకి చూస్తూ యేదో ఆలోచిస్తున్నాడు. పంకజకూడా మెల్లిగా నడుంవాల్చింది. ఎన్నిగంటలయిందో యిద్దరికీ తెలియదు. శర్మ తనుచెబుతున్నదంతా వింటున్నాడనే అనుకుని పంకజ తనలో తానే మాట్లాడుకుంటున్నట్టు చెబుతున్నది.

"నీవుకాబట్టి సరిపోయింది. మరెవడైనాఅయితే యేం కావాలి యీవాళ నా బ్రతుకు? ఈ నీచపుబ్రతుకు నే నెల్లా బ్రతకగలను. నాకు సంఘంలో తలయెత్తుకుతిరిగే అవకాశం కావాలి. యెంత దారిద్ర్యాన్నైనా హాయిగా అనుభవిస్తాను కాని, అసహ్యకరమైన ఈ బ్రతుకుమాత్రం భరించలేను. నా జీవితానికి వొక గమ్యం యేర్పరచుకొని, అక్కడికి చేరాలనుకుని బయలుదేరాను. కాని, సగందారిలోనే నా కాళ్ళు అలసిపోయినై; బలహీనమైపోయినై. ముందుకు వొక్క అడుగుకూడా వేయలేకపోయాను. ముందుకూ పోలేక, వెనక్కీ వెళ్ళలేక బాధపడుతున్నసమయంలో నీవు తటస్థపడ్డావు. నాకు చేయూతనిచ్చి, నీవెంట తీసుకువెళ్ళడానికి ప్రయత్నిస్తు న్నావు..." అని యింకా యేమేమో చెబుతోంది పంకజ. కాని శర్మ మెదలకుండావుండటం చూచి అతడు నిద్రపోయాడనుకుంది. ఆమెకుమాత్రం నిద్రపట్టలేదు. దూరాన్నుంచి టవర్

క్లాక్ పదకొండు, పన్నెండు, వొకటి, రెండు, మూడు, నాలుగు కొట్టడంకూడా స్పష్టంగా పంకజచెవుల్లో వినపడుతోంది. తరు వాత ఆమెకు తెలియకుండానే ఆమెకళ్లు మూతపడినాయ్.

# 8

ఎవరో వీపుమీాదతట్టి లేపినట్టుగా పంకజకు హఠా త్తుగా మెలకువవచ్చికళ్లు తెరచిచూచింది. మంచంమీాద శర్మ లేడు. వెళ్ళిపోయాడేమోననుకుని లేచికూర్చుని, చుట్టూ కలయచూచింది. శర్మ వెళ్ళ లేదు. కిటికీదగ్గర నిలబడి అవతలకు చూస్తున్నాడు. పంకజలేచినఅలికిడి విని వెనక్కుతిరిగాడు.

ఇంకా బాగా తెల్లవారలేదు. తూర్పుదిక్కున ఆవరిం చినమెరుపు కిటికీలోంచి బాగా కనిపిస్తోంది.

"రాత్రి బాగా నిద్రపట్టిందా...?"అని అడిగింది పంకజ శర్మను.

"ఎట్లాపడుతుంది...?" అన్నాడు శర్మ.

నిజమే! రాత్రి నిద్రయేమెరగనట్టు, బయటిప్రకృతిలాగే అతనికన్నులు భయంకరంగా యెర్రబారివున్నై. పంకజను చూచి వేడినిట్టూర్పువదలి "ఇంక నేనువెడతాను" అన్నాడు.

పంకజ లేచివచ్చి తలుపుతట్టింది. కనకాంగి తలుపు తెరచింది. గదిగడపదగ్గర శర్మనూ పంకజనూ చూచి, కన కాంగికి యెక్కడాలేనిసంబరం కలిగింది. వాళ్ళముఖాలచుట్టూ చేతులుతిప్పి మెటికలువిరిచి దృష్టితీసింది. శర్మ కనకాంగిని తప్పించుకుని అవతలకు నడిచాడు.

"మళ్ళీ యెప్పుడువస్తావు...?" అని అడిగింది పంకజ.

"పిల్లైనంతత్వరలోనే..." అంటూ శర్మ బయటకు నడిచాడు.

అతడు వెళ్ళిపోయాక కనకాంగి పంకజవైపుతిరిగి, "మళ్లీ యెప్పుడువస్తావూ అని అడగడంచేసేకేం? వొక్కసారి నీపొందు అనుభవించినవాడు పిచ్చికుక్కలాగా నీవెంటతిరగడూ!" అంది.

కనకాంగిఅనూయికత్వానికి పంకజకు నవ్వొచ్చింది. కాని యేమీ జవాబు చెప్పలేదు.

"నా భాగ్యలక్ష్మివి. నీవు కళ్లుతెరిచావు. అంతేచాలు. ఇంక నాయింట్లో కనకవర్షం కురుస్తుంది..." అంది కూతుర్ని కౌగలించుకుంటూ కనకాంగి. ఆమెచేష్టలు పంకజకు సహించలేదు. విడిపించుకుని గదిలోపలికి వచ్చింది. కనకాంగి యేదో పనిమీద లోపలికివెళ్ళింది.

పంకజకు నిద్ర ముంచుకువస్తున్నది. రాత్రి తాను కింద పరచుకున్న జంఖానా తీసి దులిపి, మళ్ళీ దాన్ని పరుపుకింద పరచుకుని మంచంమీద వాలిపోయింది పంకజ. రాత్రి కింద పడుకోవడంమూలాన వొళ్ళంతా నొప్పులు. ఆవలింతలు విపరీతంగా వస్తున్నై. ఇంతలో కనకాంగి మళ్ళీ ఆగదిలోకి వచ్చింది. కూతురు అలసటతో నిద్రపోవడం చూచి ఆమెకు నవ్వొచ్చింది. పంకజను జబ్బపట్టి కదిలిస్తూ, "వొక్కరాత్రి వొకడితోనే యింత నీరసమా? ఓయబ్బో! నీయీడులో నేను..." అని యేమేమో అంటోంది కనకాంగి. పంకజ వినలేక పక్కకు తిరిగింది.

"బాగానేవుంది, ఏం నిద్ర. లేచి మొహంకడుక్కో.

కాఫీ తాగుదువుగాని. వేన్నీళ్ళు కాగబెట్టాను. నలుగుపెట్టి తలంటిపోస్తాను. అన్నంతిని హాయిగా పడుకుందువుగాని."

కనకాంగిపోరుపడలేక లేచి వచ్చింది. పంకజ యిష్టంలేక పోయినాగాని, ఆమె చెప్పినట్లల్లా చేసింది. మొహంకడుక్కుని కాఫీతాగింది. నలుగుపెట్టించుకుని తలంటిపోసుకుంది. కనకాంగి చేష్టలు చూస్తూంటే పంకజకు పట్టరానినవ్వొవస్తున్నది. కాని నవ్వలేదు.

కనకాంగి కూతురుకోసం ప్రత్యేకంగా మిరియాలచారు కాచింది. యెన్నో వుపచారాలుచేసి పంకజను కూచోబెట్టి వడ్డించింది. పంకజ తింటూంటే పక్కనే కూర్చుని మెల్లిగా అడిగింది—

"అతనిపైనమేదో కనుక్కున్నావా?" అని.

పంకజకు యేంచెప్పడం ఇష్టంలేదు. అయినా చెప్పింది.

"నే నతణ్ణి యిదివరకే యెరుగుదును" అంది. అంత కంటే యింకేమీ చెప్పలేదు.

"అట్లా చెప్పు మరి! శోభనముహూర్తం యిదివరకే అయిందన్నమాట - యేదో నంగనాచివనుకున్నాను" అంది కనకాంగి అదోకమాదిరి యెత్తిపొడుపుగా నవ్వుతూ. పంకజకు అసహ్యంవేసింది తల్లి మాటలతో. లేచి చెయ్యికడుక్కుని గది లోకివచ్చి పరుపుమీద పడుకున్నది. ఆమెకు వొళ్లుతెలియని నిద్రవచ్చింది. పగలు పదిన్నరప్రాంతాన కళ్లుమూసినఆమెకు సాయంకాలం నాలుగున్నరకుగాని మెలకువరాలేదు. అదికూడా కనకాంగి తట్టితట్టి లేపితేనే లేచింది. లేచి ముఖంకడుక్కుని కనకాంగితెచ్చియిచ్చినకాఫీ తాగింది.

పగలు అంతసేపు నిద్రపోవడంతో ఆమెమనసు తేలిక అయినట్టనిపించింది. యే ఆలోచనా రావడంలేదు. వొళ్ళంతా యింకా నీరసంగానే వుంది. ఆవలింతలు యెడ తెరపిలేకుండా వస్తున్నై. కాని మళ్లీ పడుకోడానికి ఆమెకు మనస్కరించలేదు. తలదువ్వుకుని, చీరమార్చుకుని అలా బయట చల్లగాలిలో తిరిగివద్దామని బయలు దేరింది. ఆమె వెడుతుంటే చూచి కన కాంగి యేమీ అడగలేదు. కూతుర్ని చూస్తుంటే కనకాంగికి కలిగే ఆనందం యింతా అంతా కాదు. యెన్నాళ్ళకు తననోము పండింది, అనుకుంటోంది ఆ వెఱ్ఱిబాగులది.

పంకజ తిన్నగా పార్కులోకి వచ్చింది. వాహ్యాళికోసం వచ్చినజనం ఎడంఎడంగా, అక్కడక్కడా కూర్చున్నారు. పంకజ తనకుదగ్గరలో యెవరూ లేకుండాచూసి, వొక వైపున పారిజాతం చెట్టుకింద కూర్చున్నది. అప్పుడే విరుస్తున్న పారిజాతాల సువాసన పంకజమనసులోని మధురభావనలాగే గాలిలో తేలి పోతోంది. గూళ్ళకుచేరుకుంటున్న పక్షుల కిలకిలారవములు వింటూ పంకజ పార్కుచుట్టూ కలయచూస్తూ కూర్చుంది. పార్కులో అల్లంతదూరాన వొకపక్కన కొంతమంది యువ కులు వలయాకారంగా కూర్చుని వొకర్ని వొకరు పరిహాసాలాడు కుంటూండడంచూచిందిపంకజ. అందులో గుంటూరులో తనను బలాత్కరించి, చెంపదెబ్బతిన్న సత్యనారాయణకూడా వుండ టం చూచింది. అత డిక్కడకు యెందుకు వచ్చినట్టు? యేమో! అతడు యెందుకువస్తే తనకెందుకు? ఆమె ముఖం పక్కకు తిప్పుకోవాలనుకున్నది. కాని యింతలో సత్యనారాయణ లేచి నిలబడడం చూచింది. సత్యనారాయణ తన్ను చూచాడు.

తనవైపుకే నడచివస్తున్నాడు. ఆమెహృదయం దడదడకొట్టుకో సాగింది. అతడు మళ్లీ తనదగ్గరికి యెందుకువస్తున్నట్టు? అతణ్ణి తాను యెట్లా యెదుర్కోవటం? ఆమె కేమీ తోచడంలేదు. అయినా యింతమందియెదుట అతడు తన నేమీ చేయలేడులే అన్న ధైర్యం కలిగింది ఆమెకు. సత్యనారాయణ ఆమెను సమీపించాడు. ఆమె లేచి నిలబడ్డది.

"హెల్లో పంకజా! కులాసాయేనా?" అని పలకరించాడు చిరునవ్వుతో.

అతనిచూపుల్లోగాని మాటల్లోగాని పంకజకు వొకనాడు అతనిలోచూచినదౌష్ట్యం యీనాడు కనుపించలేదు. తనపట్ల అతనివైఖరి మారిపోయింది. ఈ వైఖరి నతనిలో ఆశించలేదు పంకజ.

"ఆ, కులాసాగానే వున్నాను. మీ రీవూరికి యెప్పుడు వచ్చారు? యేదైనా వుద్యోగప్రయత్నంమీదనా? ఈపాటికి మీరు బి.ఏ. పూర్తిచేసిఉండాలి" అన్నది పంకజ.

"నేను మద్రాసులో "లా" చదువుతున్నాను. ఈ వూళ్లో మొన్న మాస్నేహితునిపెళ్ళికి వచ్చాను. వుబుసుపోకకు ఈపార్కుకువచ్చి కూర్చుంటే నీవు కనుపించావు. పలకరించిపోదామని వచ్చాను" అన్నాడు.

అతనిలోవచ్చిన ఈ మార్పుకు పంకజ ఆశ్చర్యపడుతోంది.

"ఈపాటికి నీకూ యింటరుపూర్తిఅయివుండాలి. తరువాత చదువు మానేశావా?"

"అవును. పైచదువుకు తగినంత ఆర్థికస్తోమతు లేదు నాకు. అందుకని మానుకోవలసివచ్చింది" అన్నది పంకజ.

"యెక్కడైనా పంతులమ్మవుద్యోగం సంపాదించుకో లేకపోయావా? వూరికే కూర్చోడం దేనికి" అన్నా డతడు.

"అదే ఆలోచిస్తున్నాను-ప్రయత్నించాలి..." అన్నది పంకజ. అంతకంటే అతనిప్రశ్నకు వేరే జవాబుచెప్పడం ఆమె కిష్టంలేదు.

"నీవు మరోకవిధంగా అనుకోకపోతే నే నొకసంగతి చెబుతాను. నావెంట మద్రాసు రాకూడదూ? ఇక్కడికంటే ఆడవాళ్ళకు అక్కడ వుద్యోగాలకు అవకాశాలు యెక్కువ. నీకుతగినవుద్యోగం దొరికేవరకూ నీకయ్యేఖర్చులు నేను భరిస్తాను—" అన్నాడు

"చాలా థాంక్స్ మీ ఔదార్యానికి. కాని ఇప్పట్లో ఈవూరు విడిచిపెట్టేఆలోచన నాకు లేదు" అన్నది నవ్వుతూ పంకజ.

"సరే నీయిష్టం. ఇంక నేను వెడతాను. నాకోసం నా స్నేహితులు యెదురుచూస్తున్నారు—" అంటూ వెళ్ళిపో బోయాడు. రెండుమూడగులువేసి మళ్ళీ యెందుకో వెనక్కు తిరిగివచ్చాడు. పంకజ మళ్లీ అత నేంచెపుతాడో అని యెదురు చూస్తోంది.

"ప్రస్తుతం నీ ఖర్చులకోసం యేమైనా డబ్బుకావాలా" అన్నాడు తన లాల్చీజేబులోంచి పర్సుతీస్తూ.

"నాకు ప్రత్యేకమైనఖర్చులంటూ యేమీలేవు. ఇప్పుడు డబ్బేమీ అవసరంలేదు..." అన్నది పంకజ.

"నాదగ్గర డబ్బుపుచ్చుకోకూడదా?..." అన్నాడు మళ్ళీ సత్యం.

పంకజకు యేంజవాబు చెప్పాలో తోచలేదు. యెదుటి వాళ్ళదగ్గర యింతటి ఔదార్యాన్ని భరించలేననిపించిం దామెకు. ఆమెకళ్ళల్లో గిర్రున నీళ్ళుతిరిగినై.

"ఆ కన్నీళ్ళు దేనికి...?" అన్నాడు అతడు.

"మీ సౌజన్యానికి..." అన్నది పంకజ.

తనమానాన్నే హరించాలని వొకనాడు ప్రయత్నించిన వానిలో నేడు యెంత విపరీతమైనమార్పు! ఇదెట్లా సంభవమైంది? చెడ్డకూడా వొకనాడు మంచిగా మారుతుందంటారు, ఇదేగాబోలు! అని ఆమె ఆలోచిస్తోంది.

"నాసౌజన్యానికి నీకు కన్నీళ్ళుదేనికి? వొకనాడు నన్ను దుష్టునిగా చూశావు. బహుశా అది కారణం కావొచ్చు. ఆనాడు నిన్నుకూడా నేను దుష్టగానే విన్నాను. అందుకనే సాహసించాను. అప్పుడు నీసంగతిఅర్థమైంది. సానిదానికి సతీత్వమా? అని ఇప్పటి నీఆశ్చర్యానికన్న నా కెక్కువ ఆశ్చర్యంకలిగింది. నేను స్త్రీలోలుణ్ణే, కాదనను. ఇచ్ఛాపూర్వకంగా నాకువశులైనస్త్రీలను నే ననుభవించడంలో తప్పేముంది? ఈ వ్యభిచారదోషం ఆయా స్త్రీలలోనూ వున్నది కదా! నన్నుమాత్రమే యెందుకు దుష్టుణిగా యెంచాలి. నేను ప్రయత్నించి, బలాత్కరించికూడా నాకులొంగనిస్త్రీలజోలికి మళ్లీ యెన్నడూ పోలేదు. వారిపట్లనా వైఖరిమారినా వారు నన్ను నీచంగానే చూస్తారు. ఇంతమాత్రంచేత నాలో యే యితరసుగుణాలూ ఉండవని అర్థమా?" అన్నాడు.

ఈ మాటలంటూవుంటే సత్యనారాయణముఖంలో యేదో వింతకాంతిని చూడగలిగింది పంకజ. ఆమె మనస్సులో పెనవేసుకుని, తనకు యింతకాలం తెలియకుండావున్న ధర్మ సందేహం యేదో అవలీలగా తీరిపోయినట్లనిపించింది ఆమెకు. తన కేదో తారకమంత్రం వుపదేశంచేస్తున్న గురువులాగా కనిపించాడు సత్యనారాయణ ఆ క్షణంలో. లోలోపలనే విస్మయ భావంతో అతనికి నమస్కరించింది.

"దిగులుపడకు. నీకూ మంచిరోజులు వస్తాయి. ఇంక నేను శలవుతీసుకుంటాను" అంటూ పర్సు జేబులో పెట్టుకుని వెళ్ళి, తనస్నేహితులను కలుసుకున్నాడు. వారందరూ కలిసి యిళ్ళకు బయలుదేరారు. పంకజ వారువెడుతున్న దారివంకే చూస్తూ పెద్దగా నిట్టూర్చింది.

కొన్ని నిమిషాలు గడిచాక, ఇవతలిరోడ్డుమీద నర్మద మరికొంతమంది స్త్రీలతో వస్తూండడం గమనించింది పంకజ. నర్మద మిగతవారిని నడుస్తూండమని చెప్పి, తననుచూసి అటే వస్తున్నది చిరునవ్వునవ్వుకుంటూ. ఆమెచేతిలో చిన్న శనగల మూట, తాంబూలం, రెండు అరటిపళ్లూ వున్నాయి. కాళ్ళకు పసుపురాసుకున్నది. యెక్కడికో పేరంటానికి వెళ్ళివస్తున్నట్టు న్నది నర్మద.

"యెక్కడికో పేరంటానికి వెళ్ళివస్తున్నట్టున్నదే...?" అని అడిగింది ఆమెసమీపించగానే పంకజ.

"ఇక్కడే, కోనేరువీధిలో మావాళ్ళయింట్లో బారసాల అయితే పేరంటానికి వెళ్ళివస్తున్నాను. ఇక్కడ నీవు కనిపిస్తే చూచిపోదామని వచ్చాను" అంది నర్మద.

"కాలినడకనా—కారేమైంది—?"

"మా నాన్న తీసుకెళ్ళారు. మా ఇరుగుపొరుగువారు కొంతమంది పేరంటాండ్రు వస్తే వారితో వచ్చేశాను—"అన్నది నర్మద.

నర్మద యిప్పుడు మునుపటిలాగా లేదు. ఆమెబుగ్గల్లో యిప్పుడు మునుపటి నిండుదనం లేదు. శరీరం చాలా చిక్కిపోయివుంది. కళ్ళల్లో వెనుకటి కాంతి లేదు. ప్రోషితభర్తృక లాగా వుంది ఆమె స్వరూపం. ఆమె లోలోపలనే యేదో బాధపడుతూ, కుంగిపోతున్నట్టు గ్రహించింది పంకజ.

"ఇప్పుడు చాలా మారిపోయావు. యేమిటి సంగతి? అత్తవారింటి సుఖమా?" అని ప్రశ్నించింది.

"కాదు..." అన్నది నర్మద నవ్వుతెచ్చుకుంటూ.

"భర్తనిరాదరణా...?"

"అదంతాయేమీలేదు. నాసంగతులకేమి, ముందు నీ సంగతి చెప్పు. నీ వెట్లావున్నావు? నీ చదువు యెంతవరకు వచ్చింది?" అని అడిగింది నర్మద. పంకజకూడా ఆమెను యేమీఅడగలేదు. తనసంగతులే చెప్పింది.

"ఇక్కడ నిజాంకాలేజిలో నాకు సీటుదొరకలేదు. గుంటూరులో ఇంటరుమాత్రం పూర్తిచేయగలిగాను.' తరువాత నన్ను చదివించడానికి మాఅమ్మదగ్గర డబ్బుచాలదు. అందుకని చదువు విరమించుకోవలసివచ్చింది. ఇదీ నా స్థితి. కాని యింకొకశుభవార్త— నేను వివాహంచేసుకోబోతున్నాను—" అంది పంకజ. ఇన్నాళ్ళకు తా నీ వార్త వొకరితో చెప్పుకునేఅవకాశం కలిగింది.

"అలాగా, శుభం! యెవర్ని...?"

"ఇంటర్లో నా క్లాస్‌మేటు అతను. నన్ను గాఢంగా ప్రేమించాడు. నేను ఫలానాఅని తెలిసికూడా, నన్ను చేపట్ట బోతున్నాడు—"

"యెప్పుడు ముహూర్తం? నన్ను తప్పకుండా పిలుస్తావు కదూ?"

"ఇంకా తేదీ నిర్ణయంకాలేదు. నీవుతప్ప నా కెవరున్నారు పిలవడానికి...?"

ఈమాటలంటూ పంకజ పార్కు గేటులోంచి శర్మ ప్రవేశించడం గమనించింది. అతడు కొంతదూరం వచ్చి, పంక జను చూచాడు. అతడు తనదగ్గరకు వస్తాడనుకున్నది పంకజ. కాని హఠాత్తుగా వెనుదిరిగి వెళ్ళిపోయాడు. అతని ఈ వింత ప్రవర్తన పంకజకు అర్థంకాలేదు. "శర్మా, శర్మా"అని చప్పట్లు కొడుతూ పిలిచింది కాని, వినిపించుకోనట్లు వెళ్ళిపోయాడు.

"అతనెవరు...?" అని అడిగింది నర్మద.

"అతనే నాకు కాబోయేభర్త. బహుశా నీవు నాతో వున్నావని వెళ్ళిపోయాడేమో!..." అంది పంకజ.

నర్మదకళ్లెందుకో చెమ్మగిలటం చూచింది పంకజ. "అదోకమాదిరిగా వున్నావేం...?" అని అడిగింది.

"యేమీలేదు—పొద్దుపోయింది. ఇక నేను వెడతాను, నాకోసం వారంతా కాచుకునివున్నారు—" అంటూ వెళ్ళిపోయింది తొందరతొందరగా అడుగులు వేసుకుంటూ నర్మద.

పంకజ కేమీ అర్థంకాలేదు. శర్మ యెందుకు వెళ్ళిపోయినట్టు తను పిలుస్తున్నా? తను శర్మను పెళ్లాడబోతున్నా

నని చెబితే నర్మద యెందుకు కంటతడిపెట్టుకుని, తనయెదుట నిలుపలేనట్టు వెళ్ళిపోయింది? పంకజ చాలాసేపు ఆలోచిస్తూ అక్కడే కూర్చున్నది. గడియారం యెనిమిదికొట్టడం విని, చైతన్యంకలిగి యింటికి బయలు దేరింది.

# 8

పంకజ యింటికి చేరుకునేటప్పటికి తొమ్మిదిగంటలైంది. మామూలుగా వస్తే అరగంటలో యిల్లు చేరుకోవచ్చు పార్కు నుండి. కాని పంకజమనస్సు మామూలుస్థితిలో లేదు. ఆమె యింటికివచ్చేటప్పటికి కనకాంగి గడపముందే కూర్చుని పంకజ కోసం యెదురుచూస్తోంది.

"ఇంతసేపూ యెక్కడికి వెళ్లావు? సాయంకాలం అయి దింటికనగా యిల్లువిడిచివెళ్ళినదానివి రాత్రి తొమ్మిదింటికా కొంపకిచేరడం?" అంది కనకాంగి పంకజను చూడగానే పంకజ అందుకేమీ జవాబు చెప్పకుండానే "నిన్నటతను వచ్చాడా?" అని అడిగింది.

"నీవు అటువెళ్ళావో లేదో యిటువచ్చాడు నీకోసం. యెదురుచూస్తూ కాస్సేపు కూచుని, నీవువచ్చేస్తావు వుండమని నే నెంతబతిమాలినా నిలవకుండా వెళ్ళిపోయాడు."

"యేమైనా చెప్పాడా?"

"వలుకేబంగారమైతే నాతో యేం చెబుతాడు?"

పంకజ యింకేమీ మాట్లాడలేదు. తనగదిలోకి వెళ్ళి పోయింది. చీరైనా మార్చుకోకుండా అట్లాగే పరుపుమీద

వాలిపోయింది. ఆమెకు ఆకలైనట్టే తోచలేదు. కనకాంగి లోపలికివచ్చి "అట్లా పడుకున్నావేం? అన్నానికి లే." అంది.

— "నాకక్కఱలేదు. నీవు తిను..." అన్నది పంకజ.

"యేం? పొద్దున్ననగా యెంగిలిపడినదానివి..."

"నాకు తలనొప్పిగావుంది."

"పోనీ, కాఫీకాచి యివ్వనా...?" .

కనకాంగి వల్లమాలిన వుపచారాలుచేస్తోంది.

"నాకేమీ అక్కఱలేదు. నిద్రపోతే అదేపోతుంది"

కనకాంగి యింక కూతుర్ని బలవంతపెట్టలేదు. అవతలికి వెళ్ళిపోయింది.

సాయంకాలం నిద్రనుండి లేచినప్పుడు తేలికగావున్నట్టు తోచిన పంకజమనస్సులో మళ్ళీ ఆలోచనలు చెలరేగినై.

తను పిలుస్తున్నా శర్మ యెందుకు వెళ్ళిపోయినట్టు? నర్మద తనతో మాట్లాడుతుంటే అతడు తనదగ్గరకు యెందుకు రాగూడదు? శర్మ నర్మద పరస్పరం యెరుగుదురా? యెరిగి వుంటే "అత నెవరూ?" అని నర్మద యెందుకు ప్రశ్నిస్తుంది? అతడు తనభర్త కాబోతున్నాడంటే ఆమె యెందుకు కంటతడి పెట్టుకుంది? తను పెళ్ళాడబోతున్నానంటే అంత సంతోషం వెలిబుచ్చిన నర్మద తానుచేసుకోబోయేది శర్మను అని తెలి శాక యెందుకు తనయెదుట నిలబడలేనట్టు వెళ్ళిపోయింది? శర్మ నర్మదకేమైనా చుట్టమా? ఐతే కానివ్వు. అంతమాత్రం చేత తనదగ్గర యీ విపరీతప్రవర్తన దేనికి? యెంత ఆలోచించినా పంకజకు తనపట్ల శర్మా నర్మదలవైఖరి అవగాహన కాలేదు. శర్మ వస్తాడేమోననుకున్నది. కాని అతడు రాలేదు.

ఆమెకు నిద్రపట్టడంలేదు. అలా నిద్రపట్టకపోవడానికి రెండు కారణాలున్నవి. వొకటి: పగలు వొళ్ళుతెలియకుండా నిద్ర పోవడం. రెండు: సముద్రతరంగాల్లా వొకదానివెనుక వొకటిగా తోసుకొస్తున్న ఆలోచనలు.

శర్మనూ నర్మదనూకూడా యీసంగతి కనుక్కోవా లని ఆమె నిశ్చయించుకుంది. యెట్లాగైనా నిద్రపోవాలన్న ప్రయత్నంలో దీపంఆర్పేసి కళ్లు గట్టిగామూసుకుని పడుకు న్నది. అయినా రాత్రి రెండుదాటేవరకు ఆమెకు నిద్ర పట్టలేదు.

పొద్దున్న లేచేటప్పటికి చాలా పొద్దెక్కింది. మొహం కడుక్కుని కాఫీతాగి, మళ్ళీ తనగదిలోకి వచ్చి కూర్చుంది. యేంచేయటానికి తోచక పాత ఫిల్మిండియా వొకటి వుంటే, తీసి అందులోబొమ్మలు తిరగేస్తూ కూర్చుంది కొంతసేపు. కాని ఆమెమనస్సుమాత్రం రాత్రిజరిగినసంఘటనమీదే వుంది.

సుమారు పదిగంటలప్రాంతానికి తనగది కిటికీలోంచి రోడ్డువేపు శర్మవస్తాడేమోనని చూస్తూ నిలబడ్డది. కొంతసేప టికి తనయింటిముందు వొకకారువచ్చి ఆగింది. నర్మద కారు లాగేవుందనుకుంది పంకజ. నిజంగా అది నర్మదకారే. నర్మద తనయింటికి రావలసిన హేతువు? యేమో, ఆమె ఆలోచించ డానికి వ్యవధిలేదు. గబగబ పిధిగడపలోకి పరుగెత్తింది. ఇంటి ముందు కారు ఆగడం చూచి కనకాంగికూడా బయటకు వచ్చింది. నర్మదే తనయింటికి వచ్చింది. కారుడ్రైవరు తలుపు తీస్తే వెనకసీటులోంచి దిగి, నర్మద పంకజదగ్గరకు వచ్చింది. యెందుకో ఆమెకు గట్లుతెంచుకుని దుఃఖంవచ్చేసింది. పంకజను

కౌగలించుకుని పసిపిల్లలాగా బావురుమని యేడ్చేసింది. ఆమె ప్రవర్తన పంకజకేమీ అర్థంకాలేదు. ఇదిచూస్తున్న డ్రైవరు కుగాని, అవతల కనకాంగికిగాని బొత్తిగా అర్థంకాలేదు. ఆశ్చర్యంతో చూస్తూ అట్లాగే నిలబడిపోయారు.

పంకజ నర్మదను తనగదిలోకి తీసుకెళ్ళి, మంచంమీద కూర్చోబెట్టింది. యేంజరుగుతుందో చూద్దామన్న కుతూహలంతో లోపలికి వచ్చిన కనకాంగిని చెయ్యిపట్టుకుని తీసుకెళ్ళి గడపఅవతల నిలబెట్టి, తలుపులుమూసి లోపల గొళ్ళెంపెట్టి నర్మదదగ్గరకు వచ్చింది. నర్మద యింకా వెక్కి వెక్కి యేడుస్తూనే వుంది.

"యేమిటె యిదంతా నర్మదా...?" అన్నది పంకజ ఆమెపక్కన కూర్చుని తలనిమురుతూ.

"పంకజా!...నాకు పతిబిక్ష పెట్టవ్వూ...?" అన్నది కన్నీరుకారుస్తూ. పంకజ కేమీ బోధపడలేదు. "నీమాటలు నాకర్థంకావడంలేదు నర్మదా!" అన్నది ఆశ్చర్యంగా.

"అతడు...అతడు...శర్మ...నా భర్త..." ఆమెకు డగ్గుత్తికపడింది.

పిడుగుపడినట్టు అట్లాగే కూలబడిపోయింది ఈ మాటలు వినగానే పంకజ. ఆమె నోట మాటరాలేదు. నర్మద తన దుఃఖాన్ని దిగమింగుకుని, యిలా చెప్పనారంభించింది—

"నేను మొదట వూహించినట్టు, ఆయన పైచదువుకు మద్రాసువెళ్ళనేలేదు. దగ్గరలోవుందని గుంటూరుకాలేజిలోనే చేర్చించారు. నేను కాపురానికివెళ్ళినకొత్తలో నన్నెంత ప్రేమగా చూచేవారనుకున్నావ్. నన్నువిడిచి వొక్కక్షణం

వుండలేకపోయేవారు. ఆయన కాలేజిలో చేరాక నేను యిక్క
డికి వచ్చేశాను. తొలిరోజుల్లో నాకు వారానికి రెండువుత్త
రాలు రాసేవారు. కాని కొన్ని నెలలతరువాత ఆ సంఖ్య
క్రమంగా తగ్గుతూవచ్చింది. తరువాత నేను యెన్నివుత్తరాలు
యెన్నిసార్లుగా రాసినా, జవాబు వచ్చేదికాదు. నాకు
దిగులు, ఉత్సాహలం యెక్కువైనాయి. వేసవికి మళ్లీ నేను
చీరాలవచ్చాను. ఆయనవైఖరి నాపట్ల పూర్తిగా మారిపో
యింది. నేనువలుకరిస్తే పరధ్యానంగా బదులుచెప్పేవాడు.
ఆయనధోరణి యింట్లోవాళ్ళకి యెవరికీ అర్థంకాలేదు. వేరే
పక్కమీాద పడుకునేవారు. "నీవు నిజంగా వేళ్ళవా..."
అంటూ ఆయన కలవరించడం నేను చాలాసార్లు విన్నాను.
మాజీవితంలో మరోక స్త్రీ ప్రవేశించిందని నామనసుకు
తోచింది. యెవరితో చెప్పుకోను. ఈసారి వేసవిలో ఆయనపరి
స్థితి మరీ విపరీతంగా తయారైంది. యెప్పుడూ యేదోదిగులుగా
కూర్చునేవారు. కడుపునిండా తిండీ, కంటినిండా నిద్ర యెరు
గరు. ఆయనతోపాటు నా స్థితీ మారుతూవచ్చింది. ఇదంతా
చూచి, మా మామగారికి ఆయన్ని మళ్లీ గుంటూరు పంపడం
యిష్టంలేదు. వూరుమారిస్తేనైనా కొంతమారుతారేమోనని,
యిక్కడికి తీసుకొచ్చారు. ఇక్కడికి ప్రయాణమునేటప్పటికి
వారికి యెక్కడాలేనివుత్సాహం కలిగింది. నిన్నసాయంకాలం
పార్కులోసంఘటన జరిగేదాకా నాకుయధార్థం అర్థంకాలేదు."

మళ్ళీ నర్మదకళ్ళల్లో నీళ్లుతిరిగినై. పంకజమాత్రం శిలా
ప్రతిమలా కూర్చుని, నర్మదచెప్పినదంతా వింటోంది. కాని
ఆమెమనసు ఎలావుందో దేవుడికే తెలియాలి.

"మా రెండుకుటుంబాలకీ అయనొక్కడే ప్రాణం. నాకు పతిభిక్ష పెట్టి, నన్ను రక్షించవూ...?" అంది నర్మద ఏడుస్తూ.

"అతను నీవాడే. ఇంక నీతోనే వుంటాడు. నాకూ అతనికీ యింక యేలాంటిసంబంధమూ వుండదు..." అన్నది పంకజ యేదో గుండెనిబ్బరంచేసుకున్న దానిలాగా.

"నన్ను క్షమించు పంకజా! ఇంతకంటే నాకు గత్యంతరంలేదు. వొకనాడు నిన్ను మాయింటికి తీసుకెళ్ళి అవమానపరిచాను...నేడు..." నర్మద యింక మాట్లాడలేకపోయింది.

పంకజ ఆమెతల నిమిరింది.

"ఇందులో నీతప్పేముంది? మనం శాస్త్ర చదువుకున్న వాళ్ళం. అందుకనే ఈవిషయాన్ని ఇంత తేలికగా పరిష్కరించుకోగలిగాం. లేకపోతే ఈసమస్యతో మనం అజన్మశత్రువులం కావలసింది. ఇప్పుడు మనస్నేహానికి భంగంలేదు." అన్నది. నర్మద కన్నీళ్లుతుడుచుకున్నది. ఇంక నేను వెళతాను. చాలా సేపైంది. యింటిదగ్గర యెవరితోను చెప్పకుండా వచ్చేశాను" అంటూ లేచింది.

ఇద్దరూ బయటికివచ్చేటప్పటికి కనకాంగి కారువాడితో యేదో మంతనాలాడుతున్నది. వీళ్ళనుచూచి వెనక్కి తగ్గింది. డ్రైవరు తలుపు తెరిస్తే వెళ్ళి వెనకసీటులో కూర్చున్నది నర్మద. ఆమెకళ్ళల్లో యేదో బరువుదిగిపోయినట్టు వ్యక్తమవుతోంది. కారు శరవేగంతో వెళ్ళిపోయింది.

సంగతేమిటో కనుక్కోవాలని పంకజవెనకే వచ్చింది కనకాంగి. కాని పంకజ గదిలోకిపోయి తలుపు గట్టిగా బిగించుకుంటే, ఆమె యేమీ చేయలేకపోయింది.

మనః ప్రవృత్తి వొక మార్గానపోతే దైవేచ్ఛ మరొకలా వుంది. తత్ఫలితమే కష్టనష్ట, దురదృష్టపదాలతో వ్యవహరింప బడుతుంది. ఈ రెండు యేకముఖానసడిచినప్పుడు అదే అదృష్ట మనబడుతుంది.

యే నర్మదమనస్సుకు తాను కలలోకూడా హాని తల పెట్టలేదో ఆ నర్మదనే యిన్నాళ్లూ తనకు తెలియకుండానే కష్ట పెట్టింది. ఎలాంటి నర్మద యెల్లా మారిపోయింది తనమూ లంగా! తనకు మొదటే ఈసంగతి తెలిసివుంటే, వ్యవహారం యింతదూరం వచ్చేదా? మరి తానెందుకు శర్మయొక్క ముందు వెనుకలు కనుక్కోడానికి ప్రయత్నించలేదు? యేమో! తనమనసు కతడు నచ్చాడు. తనను పెళ్లాడుతానని మాట యిచ్చాడు. అంతే చాలనుకున్నది.

అయినా, వివాహితుడైన శర్మకి దేంబుద్ధి? నర్మదకంటె తనలో ఆధిక్యత యేమున్నది? నర్మద యేంపాపంచేసిందని ఆమె కా శిక్ష విధిస్తున్నాడు? నిన్న శర్మ తానుపిలుస్తుంటే కూడా ఎందుకు వెళ్ళిపోయాడో యిప్పు డర్థమైంది ఆమెకు. ఇంక శర్మ తనదగ్గరకు వస్తాడా? యెందుకు వస్తాడు? రాడు. మరి అతనిమనస్సును మళ్ళీ నర్మదవైపు తిప్పడ మెట్లా? యెల్లా గైనా వారిద్దరినీ తాను మళ్ళీ యేకంచేసితీరాలి.

శర్మ తనదగ్గర కింక రాడనే ఆమె నిశ్చయించుకున్నది. కాని ఆమెకు తెలియకుండానే ఆమె కిటికీలోంచి శర్మరాకకోసం యెదురుచూస్తూ చాలాసేపు నిలబడ్డది. సుమారు రెండుగంటల వేళ శర్మరావడం చూచింది. వెళ్ళి గదితలుపు తీసింది. శర్మ

లోపలికివచ్చాడు. మంచంమీద కూర్చున్నాడు. పంకజ అతని కభిముఖంగా టేబులుకానుకుని నిలబడింది అతని ముఖంలోకి నిదానించిచూస్తూ.

"ఆర్యసమాజంలో మనవివాహానికి ఏర్పాటుచేశాను" అన్నాడు శర్మ. అతనిమాటలు వింటే పంకజకు నవ్వూ, కోపంకూడ వచ్చినై. అతణ్ణి అసలువిషయంలోకి దింపాలనుకున్నది. పంకజ యేంచెబుతుందోనని యెదురుచూస్తున్నాడు శర్మ.

"నిన్న పార్కులో నన్నుచూడలేదా? యెందు కట్లా వెళ్ళిపోయావు చప్పట్లుకొట్టిపిలుస్తున్నా?" అంది పంకజ.

"చూచాను కాని, నీ వెవరితోనో మాట్లాడుతున్నావు. అందుకని వెళ్లిపోయాను" అన్నాడు తడబడుతూ.

"ఆమెను నీవు యెరుగనేయెరుగవా? ఆమె నిన్ను బాగా యెరుగునటకదా?" అంది. ఇక దాగివుండలేకపోయాడు శర్మ.

"అవును, యెరుగుదును. ఆమె నాభార్య..."అన్నాడు.

"వొకసారి వివాహమైనవాడివి మళ్లీ యెందుకు పెండ్లికి తలపెట్టావు? నర్మదచేసినదోష మేమిటి?"

"ఏమీలేదు..."

"మరి ఆమెను యెందుకు త్యజిస్తున్నావు? ఆమె అందకత్తె కాదనా?"

"కావొచ్చు. కాని నీ సౌందర్యం నన్నాకర్షించింది. నీ ముందు ఆమె పనికిమాలినదానిలా కనుపించింది..." అన్నాడు ఆవేశంతో.

"రేపు మరొక దానిముందు నేనూ పనికిమాలినదాన్నిగా కనుపించవచ్చుగా?"

"అట్లా జరుగదు"

"జరగదనిమాత్రం ఎట్లా?"

శర్మ మరి మాట్లాడలేకపోయాడు.

"యెంతో పుణ్యంచేసుకుని పుడితేతప్ప నర్మదలాంటి సుగుణశీల భార్యగా దొరకడం దుర్లభం. అలాంటి ఆమెను నీవు కాలదన్నుతున్నావు" అన్నది పంకజ.

"మీకిద్దరికీ యెలా పరిచయమైంది?" అన్నాడు శర్మ.

"నీలాగే, ఆమెకూడా నాకు స్కూల్ఫైనల్లో క్లాస్మేట్. నా దైన్యస్థితిని అర్థంచేసుకున్నది ఆమెవొక్కతే. ఆమెని కలలోకూడా నేను మోసితలపెట్టలేను..."

"మరి మనవివాహానికి అన్నీ సిద్ధపరచానుగా..."

"రద్దుచేయించు, ఇప్పుడు మించిపోయిందేమీలేదు. పరిస్థితులు విషమించిపోకముందే పానం వెలుతురులోకిరావడం నాకు చాలాసంతోషంగావుంది. యేమైనా నీవు నర్మదను విడచి పెట్టడం న్యాయంకాదు..."

శర్మ యేమీ మాట్లాడలేకపోయాడు. తను కష్టపడి కూడబెట్టినడబ్బుతో కట్టినయిల్లు భూకంపంవచ్చి కూలిపోతే కలిగేదిగులు వెలిబుచ్చుతూ కూర్చున్నాడు శర్మ.

"వెళ్ళి నర్మదను స్వీకరించు శర్మా! శుష్కించిపోతున్న ఆమెజీవితాన్ని నీఆదరంతో మళ్ళీ చిగురింపజెయ్యి" అన్నది పంకజ.

ఇంక పంకజతో వాదించి లాభంలేదని తోచింది శర్మకు.

లేచి బయటికి దారిపట్టాడు. అతడు వెళ్ళగానే పంకజ పెద్దగా నిట్టూర్చింది. నిజంగా తను యింత తేలికగా శర్మహృదయాన్ని నర్మదవైపు మరల్చగలనని అనుకోలేదు పంకజ. కాని మళ్లీ ఆమెకు సందేహం కలిగింది. అతనిమనస్సు నిజంగా మారిందా? యేమో! మెదలకుండా వెళ్లిపోయాడే! తనను వివాహంచేసు కునితీరవలసిందని ప్రాధేయపడలేదే అన్న ఆలోచన లామెలో చెలరేగినై.

ఆమె అనుమానించినట్టుగానే మళ్ళీ సాయంకాలం అయిదుగంటలకు శర్మ తనయింటివైపుకు వస్తూండడం కిటికీ లోంచి చూచింది. అతనిమనస్సు యింకా తనవైపుకు లాగు తూనేవుంది. తనమీద అసహ్యంకలిగితేగాని అతనికితనయందు విరక్తిభావం కలుగదు. మళ్ళీ నర్మదను స్వీకరించదు. మరి అందుకు మార్గమేమిటి? ఇవే ఆలోచిస్తూ నిలబడింది పంకజ.

కనకాంగి గదిలోకివచ్చింది. యెందుకో మొదట అర్థం కాలేదు పంకజకు. కాని, ఆమె కూడా వొక కోమటిసెట్టి లోపలికి వచ్చాడు. సుమారు యాభైయేళ్ళు వుండవచ్చు. పాతచింతపండురంగులో నల్లగా, బొద్దుగా వున్నాడు. యేదో కుతూహలంతో పళ్ళికిలిస్తూ తనవైపుచూస్తూ, యెవరూ చెప్ప కుండానే మంచంమీద కూర్చున్నాడు.

"చూడు తల్లీ! ఈ సెట్టిగారు నీకోసం ఎన్నాళ్ళనించో వువ్విళ్లూరిపోతున్నారు. ఇప్పటికిగాని అవకాశందొరకలేదు. ఈయననుగనుక మెప్పిస్తే, మనయింట్లో కనకవర్షం కురిసిం దనుకో..." అన్నది. సెట్టి ముసిముసినవ్వులు నవ్వుతున్నాడు. పంకజబుర్రలో వొకఆలోచన తళుక్కున మెరిసింది. తల్లి వంక

చూచి, మర్మగర్భంగా నవ్వింది. కనకాంగి నవ్వుతూ అక్కడ నుండి వెళ్ళిపోయింది. పంకజ సెట్టిసమీపానికి వెళ్ళి నిలబడింది. సెట్టికి వొళ్ళంతా గగుర్పొడిచింది.

"తలుపు వేశెయ్. ఇంకా తీసేవుంచావేం ?" అన్నాడు జేబులోంచి వొకచుట్టతీసి నోట్లోపెట్టుకుంటూ. అగ్గిపెట్టికోసం తడుముకుని బయటకు తీశాడు.

"తీసేవుండనివ్వండి, హాయిగా గాలివస్తుంది" అన్నది పంకజ అతనిచేతిలోని అగ్గిపెట్టె తా నందుకుంటూ. సెట్టికి వొళ్ళంతా చెమటపట్టినంతపనైంది. అగ్గిపుల్ల వెలిగించి చుట్టకు ముట్టిస్తూ తల మెల్లగా పక్కకుతిప్పి ద్వారంవైపుకుచూచింది. శర్మనిశ్చేష్టుడై తననే చూస్తూ నిలబడ్డాడు. అతణ్ణి బయటకు తీసుకువెళ్ళప్రయత్నంలో కనకాంగికూడా అక్కడికి వచ్చింది. సెట్టి కేమీ అర్థంకాలేదు. పంకజ శర్మదగ్గరకు వచ్చింది. "యేంచేయను శర్మా! నాకు మరి గత్యంతరంలేదు. వృత్తి సాగించడానికే నిశ్చయించుకున్నాను తర్వాత రా, ఈ సెట్టి వెళ్ళిపోయాక నీవూ నన్ననుభవించవచ్చు" అన్నది. ఆమాటలు వింటూంటే శర్మవొళ్ళు అసహ్యంతో జలదరించింది. యింక అక్కడ వొక్కక్షణంకూడా నిలువలేక వెళ్ళిపోయాడు.

పంకజకు దుఃఖం, కోపం, ఆవేశం–అన్నీ వొక్కసారే పొంగివచ్చాయి. ఆమె వెళ్ళి సెట్టిని చేతులుపట్టుకుని గబగబ లాక్కువచ్చి గదిబయటకు నెట్టింది. కనకాంగి విస్తుపోయి, యేదో అనబోతూవుంటే గదితలుపులు దభేలున మూసివేసుకున్నది. పక్కమీద బోర్లపడి వెక్కివెక్కియేడ్చింది చాలా సేపు.

# 10

వైకుంఠపాళిఆటలో పావును పెద్దపాము మింగింది. పావు మొదటిగడికి – కోతిజన్మకువచ్చింది. సరిగ్గా పంకజగతికూడా యింతేఅయింది.

పంకజ వివాహంసంగతి కొండెక్కినదీపంమాదిరయింది. వారంరోజులు గడచిపోయినై. ఈ వారంరోజులూపంకజలో యెలాంటిచైతన్యమూ లేదు. నిద్రపోతున్నదో మెలకువతో వున్నదోకూడా తెలియదు. తిండీతిప్పలసంగతి అసలు తలచ నక్కరలేదు. అస లామె ఈ ప్రపంచంలో వున్నట్టేలేదు. పంకజ స్థితి కనకాంగికి బొత్తిగా అర్థంకాలేదు. కులీనకుటుంబంలోని వొక ఆడపడుచు తనగడపలో అడుగుపెట్టినప్పుడే అనుకున్నది తనకూతురి కేదో ముప్పు దాపురించిందని. అసలువిషయ మేమిటో ఆమెకు యేమీ అవగాహనకాకపోయినా, కూతురు హృదయాని కేదో మాయనిగాయం తగిలిందని ఆమె గ్రహించ గలిగింది.

యెనిమిదవనాడు పంకజ మళ్ళీ ఈలోకానికి వచ్చింది. కనకాంగి బ్రతిమాలగాబ్రతిమాలగా కాస్త యెంగిలిపడింది. ఆమె భోంచేస్తూండగా కనకాంగి కూతురితో ఇలా అంది—

"ఆరోజున ఆ సెట్టిని యెందు కట్లా తరిమేశావు ?"

" ఏసెట్టిని ?"

"ఏ సెట్టిని అంటావేమిటే ? యేమీయెరగనట్టు. నీవు చేసినపనికి అతడేంచేస్తానన్నాడో తెలుసా ?"

"ఏంచేస్తానని బెదిరించాడేమిటి ?"

"తనపరువుప్రతిష్టానికి మనమిద్దరం తీస్కుకుంటానన్నాడు."

"అసలనికి పరుసంటూ వొకటి వుంటేకదా, పోవడానికి? అసలు పరువూ మర్యాదా వున్నవాడైతే పానికొంపల కెందుకొస్తాడు! అతగాడేమో చేసేస్తాడని నీవేమీ భయపడనక్కరలేదు..." అంటూ భోజనంముగించి లేచింది పంకజ.

ఇన్నిరోజులూ ఆగిపోయిన గడియారంలావున్న ఆమె బుర్ర మళ్ళీ పనిజేయనారంభించింది.

శర్మ మళ్ళీ నర్మదను స్వీకరించాడా? తన కా సంగతి యెట్లా తెలుస్తుంది? తనదగ్గరికి అతడు మళ్ళీ యెందుకురాలేదు? పోనీ, నర్మదఅయినా యెందుకురాలేదు? భగ్నహృదయంతో కొంపదీసి యేదైనా అఘాయిత్యంతలపెట్టలేదుకదా! తన కీ ఆలోచన అప్పుడే యెందుకు తట్టలేదు? అతనిమనస్సు విరిగేటట్లు తానుయెందుకుప్రవర్తించింది! ఆనాటిసాయంకాలం అతడు ఆత్మహత్యకు తలపెట్టివుంటే! నర్మదగతేమిటి? యేమైనా తా నంత కఠినంగా ప్రవర్తించివుండవలసిందికాదు. తనఅభిప్రాయాన్ని సహేతుకంగా అతనికి అర్థమయ్యేభాషలో ప్రశాంతంగా చెప్పి, అతనిమనస్సు నేడుకాకపోయినా, మరికొంత కాలానికైనా మారేటట్లుచేసివుండవలసింది. తను చాలా పొరపాటుచేసింది. యిప్పుడు యెంత చింతించి యేంప్రయోజనం? అంతా మించిపోయివుంటుంది. అయినా, నర్మదకు ఒకఉత్తరం వ్రాద్దామనుకున్నది. కాని నర్మదదగ్గరనుండే ఆనాడు వుత్తరం వచ్చింది లోకల్ పోస్టులో. ఆతురతో విప్పి చదివింది—

పంకజా,

నీవు యేవిధంగా ఆయనమనస్సు మరల్చగలిగావో-మళ్ళీ

నావాడైనాడు. నేను మీాయింటికివచ్చిననాడూ, ఇంతకు ముందు రెండురోజులనుండీ వారు యింటిపటునలేరు. ఆయన యెక్కడ గడిపేవారో తెలియదు. ఆ మర్నాడు మాయింటికి. తరువాత బయటకే వెళ్ళలేదు. నేను వారిని పలకరించలేదు. అందు కాయన అవకాశమివ్వలేదు. యేదో తప్పు చేసినవారిలా నన్ను తప్పించుకునితిరగడం మొదలు పెట్టారు. మొన్న శనివారంనాటిరాత్రి నిద్రపట్టక చీకట్లోకిచూస్తూ ఆలోచిస్తూ పడుకున్నాను. నా నడుముమీాద వెచ్చగా చెయ్యి పాకింది-నేను పక్కకుతిరిగాను ఆశ్చర్యంతో. "నర్మదా!" అంటూ ఆయన. అబ్బ! యేమి మగవారు...మళ్ళీ మామూలు ధోరణిలోకి వచ్చారు. ఇంతకాలం అంధకారంఆవరించిన మా కుటుంబంలో మళ్ళీ దీపంవెలిగింది. వీరిప్రవర్తన మాయింట్లో వాళ్ళకి యెవరికీ అర్థంకాలేదు. మనముగ్గురిమధ్య జరిగిన యీా కథ అంతా వొక్క మానాన్నగారితో మాత్రమే చెప్పాను. మావారికి నీమీాద యెలాంటిఅభిప్రాయం యేర్పడిందో బయట పడలేదు. కాని నాకుమాత్రం నీవు ఆరాధ్య దేవతవు. నీవు చేసినమహోపకారాన్ని యెన్నిజన్మలెత్తినా మరువలేను. నీకు చిరకృతజ్ఞురాలిని.

ఇట్లు,

నీ నర్మద.

పంకజగుండెమీాదనుంచి యేదో పెద్దబండ తీసివేసిన ట్టయింది.

మళ్ళీ శర్మ నర్మదను స్వీకరించాడు. వారిద్దరూ యేక మైనారు. ఇంక తన కేమున్నది ఈ ప్రపంచంలో? స్థితి

యేమిటి? తనచదువు గంగలోకలిసిపోయింది. తనవివాహం పురిట్లోనే సంధికొట్టిపోయింది. దేవు డెందుకు తన నీవిధంగా సృష్టించాడు? తల్లి మాటవిని కులవృత్తిననుసరించడమా? కుల వృత్తిమాట తలపుకు రాగానే ఆమెశరీరంలో పాములూ జెర్రులూ పాకినట్టయింది.

ఆలోచనలతో తలతిరిగిపోతోంది. ఆమెమనస్సులో చెల రేగిన తుఫానులాగే, బయట ప్రకృతికూడా భీకరంగా తయా రైంది. నాటిరాత్రి కారుమేఘాలుక్రమ్మి, వురుములతో, మెరుపు లతో వర్షం ఆరంభమైంది. యేనుగుతొండాలతో దిమ్మరించినట్టు యెడతెరపిలేకుండా వానకురుస్తోంది. ఆ వాన ఆవూరికే అపూర్వ మైనది. రాత్రి పదిగంటలకనగా ప్రారంభమై మర్నాటి మధ్యా హ్నం పన్నెండుదాటినా తగ్గకుండా కురుస్తోంది. సుమారురెండు గంటలకి తగ్గుముఖంపట్టింది. పంకజ కిటికీలోంచి బయటకు చూస్తూ నిలబడ్డది. రోడ్డంతా బురదతో లసపిసలాడుతూ అస హ్యంగా వుంది. అస లావూరే అసహ్యంగా తోచిం దామెకు. ఈవూరువిడచి యెక్కడికైనా వెళ్ళిపోతే బాగుండుననిపించింది. కాని యెక్కడికిపోవడం? హఠాత్తుగా ఆమెకు మద్రాసూ, మెడి కల్ కాలేజీ తలపుకొచ్చినై. మళ్ళీ ఆమెలో యేవో కొత్తఆశలు చిగురించినై. ఎమ్. బి. బి. ఎస్. చదివి డాక్టరు కావాలన్న ఆమెవాంఛ మళ్ళీ ఆమెరక్తానికి వేడియెక్కించింది. కాని ఆర్థిక స్తోమతును గురించిన యోచనరాగానే ఆమె హృదయం భయంతో వణికింది. తన కంత ధనసహాయం యెవరుచేస్తారు? కనకాంగి యింతవరకు చేసినదే గొప్ప. యింక ఆమె దగ్గర నుండి చిల్లిగవ్వ రాదు. అడగడానికికూడా తనకు హక్కులేదు.

మరి తనగతేమిటి? నర్మదను అర్థిస్తే? ఆమెమాత్రం అంతడబ్బు యెక్కడనుండి తేగలదు?—అయినా అడిగిచూస్తే తప్పే ముంది? ఈ తలంపురాగానే ఆమె మరో ఆలోచన చెయ్య లేదు. వెంటనే చీరమార్చుకుని, నర్మదయింటికి బయలు దేరింది. బురదతో అసహ్యంగావున్న రోడ్డుమీద నడచి వెళ్ళింది.

పంకజ నర్మదయింటికి వెళ్ళేటప్పటికి నర్మద కాంపౌండు లోనే వుంది. వానకు వాలిపోయిన తీగలను సరిచేస్తూ, ఆకు పచ్చని చీరతో వనదేవతలా మెరిసిపోతోంది. ఆమె బుగ్గల్లో మళ్ళీ నిండుదనం చేరుకుంది. పంకజను చూడగానే సంభ్ర మంతో దగ్గరికివచ్చి, చేతులుపట్టుకుని తన గదిలోకి తీసుకు వెళ్ళి సోఫామీదకూర్చోబెట్టి తానుకూడా పక్కనకూర్చుంది. "నా వుత్తరం అందిందా?" అని అడిగింది.

"అందింది—శర్మ యింట్లో లేడా?" అని అడిగింది పంకజ.

"లేరు. యేదో పనిమీద హైదరాబాదు వెళ్ళివస్తానని వెళ్ళారు. ఇందాకనే మానాన్న యేదో సిఫార్సు చేయించి నిజాంకాలేజీలో B. Sc. సీటు సంపాదించారు. ఈ ఫస్టునుండి కాలేజీకి వెడతారు—నీవు ఆయనకోసం వచ్చావా?" అన్నది నర్మద.

"లేదు. నీకోసమే వచ్చాను. నీవు నాకొక వుపకారం చెయ్యాలి!"

"ఏమిటది? నీవు నాకుచేసిన మహోపకారానికి నే నేం

ప్రత్యుపకారం చేయగలను?" అన్నది పంకజచేతులను తన చేతులలోకి తీసుకుంటూ నర్మద.

"ఉపకారం ప్రత్యుపకారం—ఈమాటలన్నీ మరచిపో. నే నొక మామూలు స్నేహితురాలిగా నిన్నర్థించడానికి వచ్చాను. నీకు శక్తివుంటే చేయి. లేకపోయినా నాకు కించ లేదు." అన్నది పంకజ.

"చెప్పు—నా శక్తి వంచన లేకుండా తప్పకుండా చేస్తాను.

"నాకు మద్రాసు వెళ్ళి మెడికల్ కాలేజీలో చేరాలని వుంది. నీవేమైనా ధనసహాయం చేయగలవా?" అన్నదిపంకజ. ఈమాటలు విన్నదోలేదో, "వుండు యిప్పుడేవస్తా" నంటూ ఆమె లోపలికి వెళ్ళింది. పంకజ కేమీ అర్థంకాలేదు. కొంత సేపు అలాగే ఆలోచిస్తూ కూర్చుంది. నర్మద సుళ్ళీ గదిలోకి వచ్చింది. రెండు వెయ్యిరూపాయలనోట్లు, అయిదువంద రూపాయలనోట్లు పట్టుకొచ్చి, పంకజపక్కన కూర్చుని, వాటిని పంకజచేతులలో పెట్టింది. అంతడబ్బు వొక్కసారిగా చూచే టప్పటికి పంకజ తననుతానే నమ్మలేకపోయింది.

"నీవిషయమంతా చెప్పి మా అన్నగారి నడిగాను. యిచ్చారు. నిన్న యిందుకోసమే బ్యాంకినుండి డబ్బు ఆయన తెప్పించారు. బహుశా యింతే తెప్పించివుంటారు" అంది నర్మద.

పంకజకు యేమనాలో తెలియలేదు. నర్మద తనమెళ్ళో వున్న చంద్రహారం తీసి, పంకజచేతిలో పెట్టింది. "నీవుతలపెట్టిన చదువుకు ఈ డబ్బు సరిపోదు. ఈ హారంకూడా వుంచుకో" అన్నది.

"నీహృదయం వితరణశీలమైనది. యెదుటివాళ్ళకు యెంత యిచ్చినా యింకా ఇవ్వాలనే బాధపడుతూవుంటుంది. నా కీ డబ్బే చాలు. ఈ హారం నీదగ్గరే వుంచుకో. నాకు కావలసివస్తే మళ్ళీ నీకు రాసి తెప్పించుకుంటాను" అని చంద్ర హారాన్ని మళ్ళీ నర్మదమెళ్లో వేసింది. ఇంతలో నర్మదతండ్రి వేంకటశేషయ్య చేతిలో వాకగపట్టుకుని గదిలోకివచ్చాడు. యేదో స్వంతవ్యవహారాలమీద ఆయన రెండురోజులనుండి శలవుమీద యింటిదగ్గరే వున్నాడు. ఆయన్నుచూడగానే పంకజ, నర్మదలు లేచినిలబడ్డారు.

"మెడికల్ కాలేజిలో చేరడానికి మద్రాసుకువెడుతున్నా వట, చాలా సంతోషం. మెడికల్ కాలేజి ప్రిన్సిపాల్ గారిని నేను బాగా యెరుగుదును. ఇదుగో, అతనికి సిఫార్సువుత్తరం. నీకు తప్పకుండా సీటు యిస్తాడు. అంతేకాదు హాస్టల్లోకూడా నీకు స్థానంయిప్పించమని వ్రాశాను. నీకు మళ్లీ యేమైనా డబ్బుకావలసివస్తే నర్మదపేర వుత్తరంవ్రాయి. తప్పకుండా పంపిస్తాను..."అన్నాడు.

పంకజ సిఫార్సువుత్తరాన్ని అందుకుని కృతజ్ఞత తెల్పింది. ఆమె మనస్సులో ఆనందంపట్టలేకుండావుంది. ఆక్షణంలోనే తాను లేడీడాక్టరు అయిపోయినట్టు వూహించుకుని, వుబ్బి తబ్బిబ్బైపోయింది. వేంకటశేషయ్య అంతకంటే యేమీ మాట్లాడలేదు. లోపలికి వెళ్ళిపోయాడు.

పంకజ యింటికివెళ్ళడానికి లేచింది. మళ్ళీ వానలంకించు కుంది. పంకజను కూర్చోబెట్టి, నర్మద లోపలికివెళ్ళి కాఫీ, ఫల హారం తెచ్చి ఆమెముందుపెట్టి బలవంతపెట్టింది. పంకజ ఫల

హారంతీసుకొని, కాఫీతాగింది. తరువాత గంటసేపటికిగాని వాన తగ్గలేదు. మళ్లీ బయలుదేరబోతూవుంటే సగంతడిసినబట్టలతో శర్మ గదిలోకి వచ్చాడు. పంకజనుచూచి ఆశ్చర్యంతో అట్లాగే నిలబడిపోయాడు. నర్మద వారిసమక్షంలో నిలువజాలనట్టు పట్టరానిసిగ్గుతో లోపలికి పరుగెత్తి వెళ్ళింది.

"ఏందు కంత ఆశ్చర్యంగా చూస్తున్నావు? నేనిక్కడికి యెందుకువచ్చాననా?" అని అడిగింది పంకజ.

"అవును..." అన్నాడు శర్మ.

"నే నీ వూరు విడిచి వెళ్ళిపోతున్నాను. నర్మదతో చెప్పివెడదామని వచ్చాను..." అంది. ఇంకేమీ చెప్పడానికి ఆమెకు యిష్టంలేదు.

శర్మ యేమీ మాట్లాడలేదు.

"శర్మా! నీవు నా కొక మాట యివ్వాలి" అంది మళ్లీ.

"ఏమని...?" అన్నాడు.

"నర్మదను యింకెన్నడూ విడువనని. ఆమె నిన్ను హృదయపూర్వకంగా ప్రేమిస్తోంది. ఆమెనువదలడం నీకు ధర్మం కాదు. నీవుప్రేమించినస్త్రీకంటె నిన్నుప్రేమించినస్త్రీని చేపట్ట డమే నీకు సౌఖ్యదాయకం..." ఈమాటలంటూవుంటే అతని కేదో వుపదేశంచేయగలిగినగురుత్వం తనకుకలిగినట్టు ఆమె భావించింది. శర్మ పంకజచేతిలో చేయివేశాడు. "నర్మదను యింకెన్నడూ విడిచిపెట్టను పంకజా!" అన్నాడు.

"ఇంక నేను వెళ్ళివస్తా"నంటూ పంకజ బయటకు వచ్చేసింది.

వాన బాగా వెలిసిపోయింది. ఆకాశమంతా మబ్బులు విడిపోయి నిర్మలంగావుంది. ఆమెహృదయంలోనూ మబ్బులు విడిపోయి నిర్మలంగావుంది. ఆమె యింటిముఖంపట్టింది.

# 11

పంకజ ఇంటికిచేరుకునేటప్పటికి రోడ్డుమీద మునిసిపల్ దీపాలు వెలిగించారు.

ఆమె వసారాలో ప్రవేశించేటప్పటికి లోపలిహాల్లోంచి కనకాంగి యెవరితోనో మాట్లాడుతున్నధ్వని వినవచ్చింది. ఆ క్రొత్తవ్యక్తికంఠస్వరం తా నిదివరకెప్పుడూ వినివుండలేదు. హాలుతలుపులు తీసేవున్నై. పంకజ అక్కడే కొంతసేపు ఆగి పోయింది, లోపలికివెళ్ళడానికి అనుమానిస్తూ.

"యెక్కడ మా వూరు, యెక్కడ సికింద్రాబాదు. బంధువులింట్లోపెళ్లికి తప్పనిసరిగా వచ్చి వూరుచూసివద్దామని బయలుదేరి, యిలావస్తే, కామినీపిశాచంలా నీవు పట్టుకు న్నావు..." అని విరగబడినవ్వుతున్నా డతను.

"నన్ను పిశాచి అనండి, దయ్యం అనండి, ఏదైనా మీకే చెల్లుతుంది."

"ఓయబ్బో! నాలాంటివాళ్ళు లక్షమంది నీకు..."

"యెందరున్నా మీలాంటిరసికులు వొక్కరూలేరు..."

"యేదో వొక్కసారి......"

"అబ్బ! యేమి టా మోటుసరసం...!"

పంకజ యింక అక్కడేనిలబడి వుండలేకపోయింది. ఎట్లాగైనా లోపలికి తనగదిలోకి వెళ్ళిపోవాలి. కాని, ఆ హాల్లోంచి

తప్ప తనగదికి వేరేమార్గం లేదు. ఆమె తెరువచేసి లోపలికి వెళ్ళింది. హాల్లో సోఫామీద కనకాంగి, వో కాయన-సుమారు యాభైఅయిదుసంవత్సరాలవయస్కు-నిబడిలో వాలివుంది.అతని ముఖంలో రాజసం వుట్టిపడుతున్నది. వొడ్డూపొడుగూగల మనిషి. శ్రీమంతునిలక్షణాలు కనిపిస్తున్నై అతనిలో. వారిని చూస్తే పంకజకు నవ్వొచ్చింది. కాని నవ్వలేదు. కనకాంగి పంకజరావడం చూచి, అతణ్ణివిడిపించుకుని పక్కకుజరిగి కూర్చున్నది.

"అమ్మాయి పంకజ..." అని చెప్పింది అతనితో.

అతడు పంకజను యెగాదిగా చూచాడు. యెందుకో విరగబడినవ్వాడు.

"బలే. తెలివంటే నీది. అమ్మాయికి తగినపేరు పెట్టావు. నువ్వో బురదగుంటవి. బురదలోంచిపుట్టుకొచ్చిన కమలంలా వుంది."

కనకాంగి ముసిముసినవ్వులు నవ్వుతూ నిలబడ్డది. పంకజ కెందుకో అతణ్ణిచూస్తూవుంటే, అక్కణ్ణించి కదలాలని పించలేదు. అల్లాగే నిలబడిపోయింది

"పోనీ కొంపకొచ్చినందుకు నాలుగు ఆకులూవక్క లైనా నామొహానపడెయ్" అన్నాడు. కనకాంగి లోపలికి వెళ్ళిపోయింది. అతడు పంకజనుసమీపించాడు. రెప్పవాల్చ కుండా ఆ మొఖంలోకిచూస్తూ వుండిపోయాడు. యెందుకో పంకజగుండె దడదడకొట్టుకోసాగింది. రక్తంలో కొత్తపొంగు వచ్చింది. యేదో చెప్పుకోరానిగౌరవభావంతో ఆమెశిరస్సు వాలిపోతున్నది. యేనాటినుంచో చూడాలనుకున్న వ్యక్తి

యెవరో తనయెదుట ప్రత్యక్షమైనట్టుతోచిం దామెకు. ఆమె చేష్టలుడిగి నిలబడ్డది. ఇంతసేపూ రెప్పవాల్చకుండా చూస్తున్న ఆ వ్యక్తి పంకజమీద చేయివేయబోయాడు. అంతలో తాంబూలం చేతపట్టుకుని కనకాంగి అక్కడికి వచ్చింది. ఆ దృశ్యాన్ని చూచి,

"ఆగండి, ఆగండి, యెంతచెడ్డా మా సానిజాతికీ నీతంటూవొకటి వుందండీ" అన్నది.

"ఏమిటే నీగోల...?" అన్నా డతడు.

"అది మీ రక్తంపంచుకుని నాకడుపున పుట్టింది..." అన్నది కనకాంగి.

పంకజకు వణుకుపుట్టింది. తలతిరిగిపోతున్నట్టనిపించింది. ముచ్చెమటలుపోసినై. యితడా తనకు తండ్రి?

"యెందుకో రక్తసంబంధం అనేటప్పటికి మనసు వెనక్కు లాగుతుంది..." అన్నాడు చేతులు వెనక్కు తీసుకుంటూ ఆ వ్యక్తి—"ఈమె నిజంగా మనబిడ్డేనంటావా...?"

"అవును. మీ తెలివితేటలూ, నా అందచందాలు రెండూ రూపొందినై దానిలో......" అన్నది కనకాంగి సగర్వంగా.

అతడు పెద్దగా నవ్వాడు. "యింకా నయం. నీ తెలివితేటలూ, నా అందచందాలూ రాలేదు...!" అన్నాడు.

పంకజ ఇంక అక్కడ నిలబడలేకపోయింది తనగదిలోకి వెళ్ళిపోయింది.

అతడు నిజంగా తనకు తండ్రా! పంకజ పదేపదే ఆలోచిస్తోంది. చాలాసేపటికి కనకాంగి ఆమెదగ్గరికి వచ్చింది.

కూతురుతల నిమురుతూ "అట్లా పడుకున్నా వేం? భోజనా నికి లే..." అని పిలిచింది.

పంకజ కనకాంగిముఖంలోకి చూచింది. "ఆయన వెళ్ళి పోయాడా?"

"అప్పుడే వెళ్ళిపోయాడు. దేనికి?"

"ఆయన నిజంగా నాకు తండ్రా?"

"సాక్షాత్తూ నీకు తండ్రే. నేను తెనాలిలోవుండగా వొకసంవత్సరంపాటు నన్ను చేరదీశాడు. అప్పుడే నీవు నా కడుపునపడ్డావు—

"ఆయనది తెనాలా?"

"కాదు. అతనిభార్య పుట్టిల్లు తెనాలి. మామగారి వ్యవహారాల్లో సహాయం చేయడానికి కొంతకాలం అక్కడ వున్నాడు. అప్పుడు నన్ను చేరదీశాడు. అప్పుడే అతనికి వొక కొడుకు, కూతురూ వున్నట్టు విన్నాను. నిజంగా దర్జాపురుషు డంటే ఆయనే. ఆయన నన్నాదరిస్తూవున్నంతకాలం మరొకడు నన్ను కన్నెత్తి చూచేవాడా? నీవు కడుపునపడ్డ కొన్ని నెలలకే అక్కడ పని పూర్తిఅయి, తమవూరు వెళ్ళిపోయాడు"

"ఆయన మళ్లీ వస్తాడా...?"

"రాడు. రేపే వూరికి వెడుతున్నాడట. నీకు మంచిచీర కొనియివ్వమని వందరూపాయ లిచ్చివెళ్ళాడు. రేపు బజారుకు వెళ్ళి నీకు యిష్టమైన చీర కొనుక్కుందువుగాని – లే, అన్నం తిందువుగాని." అంటూ కనకాంగి లోపలికి వెళ్ళింది.

అతడు తనతండ్రి! వందరూపాయలతో ఆయన బాధ్యత తీరిపోయింది. తను కనకాంగి కూతురు.

ఇష్టంలేకపోయినా, వెళ్ళి అన్నంతినివచ్చింది పంకజ. మళ్ళీ చాలాసేపటికి ఆమె కనకాంగిగదిలోకి వెళ్ళింది. కనకాంగి తాంబూలంనములుతూ మంచంమీద కూర్చునివుంది. పంకజ యెందుకువచ్చిందో ఆమెకు అర్థంకాలేదు.

"అమ్మా!" అన్నది పంకజ చాలారోజులతరువాత ఆమె కనకాంగిని అమ్మా అని సంబోధించింది.

"ఏమిటి...?" అని అడిగింది కనకాంగి.

"నన్ను గురించి ఆయనతో యేమని చెప్పావు?"

"ఏమని చెప్పివుంటా ననుకున్నావు?..." అన్నది కనకాంగి.

"ఏమో! నాకేం తెలుసు? నీవేదైనా చెప్పగలవు" అంది పంకజ.

ఆమాటతో కనకాంగి చిరెత్తుకొచ్చింది.

"నా కేంపట్టింది అడ్డమైనకూతలు కూయడానికి? వున్న సంగతే అతనితో చెప్పాను." అంది.

"ఏమని?"

"ఏమని చెబుతాను? నీవు యింటరుమీాడియేటుపాసై వచ్చావనీ, నాలాంటిసానికొత్తువు కావనీ చెప్పాను చాలా?" అంది చేతులుఆడిస్తూ కనకాంగి.

"అందు కాయ నేమన్నాడు?"

"ఏమంటాడు? పళ్ళికిలించి విరగబడి నవ్వాడు. నీ పిచ్చిగాని, సానికూతురు సానికూతురే. సానికొంపలో యింత యెదిగినపిల్ల సీతమ్మలాంటిప్రతివ్రత అంటే యెవరు నమ్మ తారే! చదువులువెలిగి స్త్రీమాత్రం సానికూతురు సావిత్రి అయి

పోతుందా? తరతరాలుగా మనకులంలో కనీవినీయెరుగని వెఱ్ఱి వేదాంతంపట్టుకుని నన్ను పతివ్రతా అను, నన్ను పతివ్రతా అను, అంటే యెవడంటాడే, నీ చాదస్తంగాని. యేమో తల్లీ! నీకు యెన్నడు బుద్ధివస్తుందో, యెన్నడు నీకాళ్ళమీదనీవు నిలబడుతావో! నా యీ శాస్త్రపాణం గుటుక్కుమనేనా, తరువాత నీ బతుకు కుక్కలుకూడా చూడవు. యేదో నాది కన్నకడుపు..." అంటూ పరుపుమీద వాలిపోయింది కనకాంగి.

పంకజ తనగదిలోకి వచ్చేసింది. రాత్రి ఆలోచిస్తూ పడుకుంది. తనకూ వొక తండ్రివున్నాడు. తనగతి యేమైనా అతనికి పట్టింపులేదు. 'అతనెవరో తానెవరో అంతే. తాను కనకాంగి కూతురు మాత్రమే.

మర్నాడు పొద్దుటినుంచీ మద్రాసు ప్రయాణానికి సిద్ధమౌతున్నది పంకజ. ఆ సాయంకాలంబండికే బయలుదేరి వెళ్ళాలని నిశ్చయించుకున్నది.

నర్మదయిచ్చినడబ్బులో వొక వందరూపాయలనోటు మార్చి, వొక సూటుకేసు, చిన్నహోల్డాలు, రెండు సాదా చీరెలు, యింకా తనకుఅవసరమైన కొన్నివస్తువులు కొనుక్కొని యింటికివచ్చింది పంకజ. పెట్టె, హోల్డాలూ సర్దుకుని, టికెట్టుకు, చిల్లరఖర్చులకు చాలినంతడబ్బుమాత్రం బయట వుంచుకుని, తక్కినడబ్బంతా పెట్టెలో బట్టలఅడుగున పెడుతూంటే, కనకాంగి గదిలోకి వచ్చింది. కూతురు ప్రయాణసన్నాహం ఆమెకేమీ బోధపడలేదు. కూతురిచేతిలో వెయ్యిరూపాయల నోట్లు చూచేటప్పటికి ఆమెకళ్ళు జిగేలుమన్నాయి. ఇంత

పైకం పంకజ కెట్లా వచ్చింది? కనకాంగి యేమీ మాట్లాడ కుండా బయటకు వెళ్ళిపోయింది. కనకాంగి గదిలోకి వచ్చిందీ, పోయిందీకూడా పంకజ గమనించనే లేదు.

ఇంతాచేసిందిగాని, పెట్టెకుతగినచిన్న తాళం కొనుక్కు రావడం మరిచిపోయింది పంకజ. మళ్ళీ బజారుకెళ్ళి తాళం కొనుక్కువచ్చి పెట్టెకు వేస్తూవుండగా కనకాంగి గదిలోకి వచ్చింది మళ్ళీ.

"ఎక్కడికీ ప్రయాణం?" అని అడిగింది.

"మద్రాసు..." అంది పంకజ.

"దేనికి...?"

"దేనికో నీకెందుకు? ఇంక నాకూ నీకూ యేసంబంధమూ లేదు. నాదారిన నేను పోతున్నాను" అన్నది పంకజ విసురుగా.

"అంతేలే. యెవరికెవరు? పెడితే పెళ్ళి పెట్టకపోతే చావూను. నిన్ను కని, పెంచి, పెద్దదాన్ని చేసి, చదువులు చెప్పించి, నీవుఅడిగినదానికల్లా దోసిళ్ళతో డబ్బుదిమ్మరించి నందుకు చివరకు ఇదా నీవు నాకిచ్చే ప్రతిఫలం..." అన్నది కనకాంగి. ఆమెకళ్ళల్లో నీళ్ళుతిరిగినై — "ఆఖరికి నన్ను విడిచి పెట్టి పోతావుటే...నా ముసలితనంలో యేదో కాస్త గంజి కాచిపోస్తావనుకున్నాను గాని..." అన్నది ఏడుస్తూ.

నిజమే. కనకాంగిమాటల్లో వొక్కటీ అబద్ధంలేదు. వొక్కనీచవృత్తితప్ప ఆమెలో అసహ్యించుకోవలసింది ఏమీ లేదు. పంకజకళ్ళలోనూ నీళ్ళు గిర్రున తిరిగినై.

"అమ్మా! యీ నరకకూపంలోంచి ముందు నన్ను బయటపడనివ్వు. తరువాత నిన్ను తప్పకుండా ఆదుకుంటాను" అంది.

సాయంకాలం యింటిముందు టాంగాలో పెట్టెలన్నీ సర్ది పెట్టి, పంకజ వెళ్ళి అందులో కూర్చుంది. కనకాంగి గడప దగ్గరే నిలబడి, "పోవద్దే అంటే పోతున్నావుకదూ–పో! నీవు మాత్రం బాగుపడవు–నా వుసురుకొట్టకపోదులే నీకు." అని గట్టిగా శాపనార్థాలు పెట్టి దభేలున తలుపేసుకున్నది.

పంకజ యేమీ మాట్లాడలేదు. బండివాణ్ణి పోనివ్వమంది. టకటకమంటూ బండి కదిలింది. ఆ బండిచక్రాలు రోడ్డుమీదకాదు–ఆమెగుండెలమీద దొర్లుకుంటూ వెడుతున్నట్టుంది.

## 12

ఆశాదృక్కులతో నిరీక్షిస్తూకూర్చుంది పంకజ మెడికల్ కాలేజి ప్రిన్సిపాలు తనకు సీటువిషయమై యేంచెబుతాడోనని.

ప్రిన్సిపాలు పంకజతెచ్చియిచ్చిన వేంకటశేషయ్య సిఫార్సువుత్తరం నిదానంగా చదువుతున్నాడు. మధ్యమధ్య తల యెత్తి కళ్ళజోడులోంచి పంకజవైపు చూస్తున్నాడు. పంకజ ఇంటరుమేడియేట్ ట్రాన్స్‌ఫర్ సర్టిఫికెటు, మార్కుల మెమోరాండం, కాండక్టుసర్టిఫికెటు పెట్టినకవరును రెండుచేతులతోనూ పట్టుకుని మోచేతులను టేబులుకానించి, చెవులురిక్కించి కళ్ళప్పగించి చూస్తూ కూర్చున్నది. ఆయన వుత్తరంచదవడం ముగించి, వొకసారి గొంతుసవరించుకుని యేదో నిర్ణయాన్ని చెప్పబోతున్నవాడిలాగా ముఖంపెట్టి——

"నీవు యే ప్రిన్సిపాల్ పేరిట ఉత్తరం తెచ్చావో ఆయన ప్రస్తుతం యిక్కడ లేరు. వైద్యశాఖాపరిశోధనలకోసం అమెరికా వెళ్ళారు. ఆయన తిరిగిరావడానికి యింకా సంవత్సరంపడుతుంది. ఇప్పుడు ఆయనస్థానే నేను పనిచూస్తున్నాను. నీవు బహుశా సీటువిషయమయ్యే వచ్చివుంటావని నీవు తెచ్చిన వుత్తరం విప్పి చదివాను. పాపం! నీవు చాలా ఆలస్యంగా వచ్చావు. ఈసారి యెప్పుడూ రానంతమంది వచ్చారు మెడికల్ కాలేజీలో సీట్లకోసం. చాలమందికి నిరాశకలిగింది. హాస్టల్లో కూడా సదుపాయాలకు చాలా యిబ్బందిపడవలసివస్తోంది మామూలుకుమించి సీట్లు యిచ్చినందుకు. నీవు యింకోసంవత్సరం ఓపికపడితే, వచ్చేసంవత్సరం నీకు సీటుయివ్వడానికి తప్పకుండా ప్రయత్నిస్తాను. శ్రీ వేంకటశేషయ్యగారికి నా క్షమాపణలు చెప్పు" అన్నాడు.

పంకజ యింతసేపూ యేంవింటున్నదో ఆమెకే తెలియలేదు. గంపెడంతఆశతో వచ్చింది. పైమాటలు విని, ఆమె నోట మాటపెగలడంలేదు. ప్రిన్సిపాల్ కళ్ళజోడు తీసి, రిస్టువాచికేసి చూచుకుని, మళ్ళీ అద్దాలుపెట్టుకుని "నాకు చాలా అర్జంటుపని వుంది, నీవు వెళ్ళవచ్చు" అని గదివిడిచి వెళ్ళిపోయాడు. ఆ ప్రిన్సిపాల్తోపాటే ఆగదిలో వెలుతురుకూడా వెళ్ళిపోయినట్టు తోచింది పంకజకు. ఆమె అక్కడ యెంతసేపు కూర్చుందోయేమో, జవానువచ్చి హెచ్చరించగా లేచి బయటకు వచ్చింది.

తడబడుతున్న అడుగులతో ఆమె మెడికల్ కాలేజి ఆవరణ గేటుదగ్గరికి వచ్చింది. కిలకిలనవ్వుకుంటూ తెల్లటిదుస్తులు

ధరించి, వొకచేత్తో నోటుబుక్కు, మరోచేత్తో స్టెతస్కోపూ పట్టుకుని కొంతమందివిద్యార్థినులు గేటులోపలికి వచ్చి, క్లాసులోకి వెళ్తూంటే వారివంకే చూస్తూ నిలబడిపోయింది పంకజ. తన కా భాగ్యంలేదు. ఆమె దీర్ఘంగా నిట్టూర్చింది. "పోవద్దే అంటే పోతున్నావుకదూ, పో పో, నీవుమాత్రం బాగుపడవు. నా వుసురుతగుల్తుందిలే నీకు..." అని శాపనార్థాలుపెడుతున్న కనకాంగి ఆమెస్మృతిపథంలోకి హఠాత్తుగా వచ్చింది. ఆమె దేహం భయంతో కంపించింది. అప్రయత్నంగా కళ్ళల్లోనిండిన కన్నీరు తుడుచుకుంటూ ఆమె గేటుదాటి ఇవతలికి వచ్చేసింది. తనకు కాలేజిలో సీటు తప్పకుండా దొరుకుతుందని ఆశించింది. నిజానికి తనవద్దనున్న డబ్బు ఏపాటి? ఎలాగూ సరిపోదు. కాని, యింతమద్రాసుమహానగరంలో తనఅయిదేళ్ళచదువుకూ తగిన సహాయంచేయగల పెద్దమనిషి వొకడైనా వుండడాఅన్న ధైర్యంతోనే వచ్చింది. కాని యిప్పుడామెఆశలన్నీ కుప్పకూలి పోయినై.

ఆ సముద్రంలాంటి మహానగరంలో ఆమె లక్ష్యం లేకుండా తిరుగుతోంది. మద్రాసులో సముద్రం వుంది. ఆ సముద్రజలం యేవిధంగా తనకు తాగడానికి వుపయోగించదో, మద్రాసువాసులుకూడా తన కల్లాగే వుపయోగించరు. అంత మందిలోనూ తాను యేకాకి.

ఆమె బస్సుల్లో, ట్రాముల్లో, రిక్షాల్లో, మధ్యాహ్నమంతా యెక్కడెక్కడో తిరిగింది. యేదో హోటల్లో భోజనం చేసింది. యెక్కడో కాఫీ తాగింది. మతిపోయినదానిలా తిరుగుతోంది. ఇంక తనగతి యేమిటి? మళ్లీ సికింద్రాబాదు వెళ్ళ

డమా? ఈ ఆలోచనరాగానే ఆమెశరీరం వణికింది. మరి ఇక్కడే వుండి యేదైనావుద్యోగంకోసం ప్రయత్నించాలేమో? తనకు తగినవుద్యోగం చూపించేవారెవరు?

ఆమెకు సత్యనారాయణ జ్ఞాపకంవచ్చాడు. 'లా' కాలేజికి వెళ్ళి, అతణ్ణి కలుసుకోవాలనుకున్నది. యెందుకో అతణ్ణి చూడడానికి ఆమెమనస్సు వెనక్కులాగింది. ఆ యోచన విరమించుకున్నది. సాయంకాలం ఆరుగంటలవేళ ఆమె పారీస్ కార్నర్ దగ్గర బస్సుదిగింది. ఆమెకు మద్రాసు కొత్త అన్న దిగులు లేదు. యెక్కడికి వెళ్ళాలన్నా సరైనమార్గంవిచారించి తెలుసుకుని మరీ వెళ్ళేధైర్యం ఆమెకుంది.

పారీస్ కార్నర్ కు చేరువలోనేవున్న మోడరన్ కేఫ్ లో ఆమె దిగింది వచ్చినపూట. ఆమె బస్సుదిగి, హోటల్ కేసి పరధ్యానంగా నడుస్తుంటే యెవరో యిద్దరు వ్యక్తులు ఆమెను రాచుకున్నంత దగ్గరగా ముందుకు తోసుకుపోయి వెనక్కు తిరిగిచూస్తూ వెళ్ళారు. పంకజ యిటూ అటూ చూస్తూ హోటల్లోకి వెళ్ళింది. మేడమీద తనగదిలోకి వెడదామని మెట్లు యెక్కబోయి, మనస్సులో చెప్పలేని ఆవేదన కడుపులో చెయ్యిపెట్టి కలచినట్టుండగా, యేదైనా కాస్త టిఫిన్ చేసి వెడదామని రెస్టారెంటులోపలికి వెళ్ళింది.

వడా, సాంబారు తెప్పించుకు తిన్నది. కాఫీతాగుతూండగా యిందాక బస్సుస్టాండుదగ్గర తనను దూసుకుపోయిన యిద్దరువ్యక్తులూ తన కెదురుగా బల్ల దగ్గరకూర్చుని తనను యెగాదిగా చూస్తున్నారు. వారిచూపునుండి తప్పించుకోవడానికి ముఖాన్ని పక్కకు తిప్పితే, ఆ మూల వొక యువదంపతులు

కూర్చుని వున్నారు. వాళ్ళ యేడాదిబిడ్డకూడా బల్లమీద కూర్చుని అల్లరి చేస్తోంది. అతన్నెక్కడో, యెప్పుడో చూసినట్టు జ్ఞాపకం. చప్పున స్ఫురణకు రావడంలేదు. అతడుకూడా తనను తదేకదృష్టితో చూస్తున్నాడు. పంకజ కాఫీతాగింది బిల్లుచెల్లించడానికి మేనేజరు టేబులుదగ్గరికి వచ్చింది. ఆమె బిల్లుచెల్లిస్తూవుండగా ఆ యిద్దరువ్యక్తులూకూడా బిల్లుచెల్లించడానికి వచ్చారు. అందులో వొకడు యింకొకడికి కన్నుగీటి, "ప్రయత్నిస్తే పడేసరుకే!" అన్నాడు.

పంకజకు వొళ్ళుమండింది. లాగి అతనిచెంపమీద వొక్కటంటించింది.

"ప్రయత్నిస్తే యెందుకుపడదూ, యింకా రెండు పడుతాయి." అన్నది ఆమెముఖం జేవురించింది. చెమటలుపట్టినై. హోటల్లోవారంతా ఆశ్చర్యంగా చూస్తున్నారు. ఆ యిద్దరూ కిక్కురుమనకుండా మాయమైపోయారు. పంకజ అక్కడ నిలబడలేకపోయింది. గబగబ తనగదిలోకివచ్చి, మంచంమీద బోర్లపడిపోయింది. ఆమె చెయ్యి యింకా వణుకుతూనే వుంది. ఆమె కెందుకో దుఃఖం ముంచుకొచ్చేసింది. కొన్నిక్షణాలు గడిచాక, ఆమె తలను యెవరో నిమురుతున్నట్టుతోచి పక్కకు తిరిగింది. ఇందాక హోటల్లో భార్యాసమేతంగా కూర్చున్న వ్యక్తి తనతల వాత్సల్యంతో నిమురుతున్నాడు.

"నీవు చాలా సాహసంగల పిల్లవు పంకజా..." అన్నాడు.

పంకజ అతనిముఖాన్ని పరిశీలనగా చూచింది. అతడే తన స్కూల్ ఫైనల్ పరీక్షలకుముందు తనతల్లి తనగదిలో!

పంపించినతను! పంకజ ఆశ్చర్యంతో చూస్తూ లేచినిలబడింది.

"నన్ను గుర్తుపట్టలేదా?" అన్నాడు.

"ఇప్పుడు జ్ఞాపకంవచ్చింది..."అన్నది పంకజ.

"ఆనాడు నీవు నా ప్రవర్తనను పూర్తిగా మార్చగలిగావు.విచ్చలవిడిగాతిరగడంమాని, వివాహంచేసుకున్నాను..." అన్నాడు.

పంకజ యేమీ మాట్లాడలేదు. చిరునవ్వునవ్వింది.

"ఈపాటికి నీవు యింటరు పూర్తిచేసివుండాలి ఇక్కడ మెడిసన్ చదవడానికి వచ్చావా?" అన్నాడు.

"అవును. కాని నాకు మెడికల్ కాలేజిలో సీటు దొరకలేదు" అన్నది పంకజ.

"మళ్ళీ మీఅమ్మదగ్గరికి వెడతావా?" అన్నాడతడు నవ్వుతూ.

"యేమో, నాకేమీ తోచడంలేదు——" అంది పంకజ.

అతడు సాలోచనగా పంకజముఖంలోకి చూచాడు. పంకజకూడా అతణ్ణి యేదో అడగాలన్నవుద్దేశంతో అతని ముఖాన్నిచూస్తూ వూరుకుండిపోయింది. కొన్నిక్షణాలు గడిచాక "సముద్రంలాంటి యీ మహాపట్టణంలో నాకు సహాయంచేసేవారెవరు?" అంది

"ఇక్కడ మైలాపూర్‌లో నాకు తెలిసినవారు శ్యామలాంబ అని వున్నారు. ఆమె అడ్వకేటు. ఆమెభర్త రాఘవయ్యకూడా వాళ అడ్వకేటే. ఇద్దరూ సంఘసంస్కర్తలే. నీకు ఆమెపేరట వొకవుత్తరం యిస్తాను. నీవువెళ్ళి ఆమెను కలుసుకో. ఆమె నీకు తప్పకుండా సహాయంచేస్తుంది యేదీ

వొకకాగితం..." అంటూ తనజేబులోంచి ఫౌంటెన్ పెన్ తీశాడు.

పంకజ కాగితంచింపడానికి పెట్టెలో పెట్టిన నోటుబుక్కు కోసం పెట్టె తెరిచింది. ఆమెకు ఆశ్చర్యం కలిగింది. పెట్టెలో పై వస్తువులు పెట్టినవి పెట్టినట్టేవున్నైగాని, అడుగున అంతా యెవరో కెలికినట్టుంది. యెవరిపనై వుంటుంది? తాను వేసినతాళం వేసినట్టేవుంది. ఇంతవరకూ తనకు పెట్టెతీసేఅవసరమే లేక పోయింది. పొద్దున హాంగర్లోనుంచే చీరా అదీ తీసుకుంది. తనకు ముఖ్యంగా కావలసిన సర్టిఫికెట్లూ అవీ చిన్నచేతిపెట్టెలోనే వుంచుకోవడంచేత పెద్దపెట్టె తెరిచేఅగత్యమే లేక పోయింది. గదిలో తనులేనప్పుడు యెవరో ప్రవేశించడానికి వీల్లేదు. ఆమెకు చటుక్కున బట్టలఅడుగునపెట్టిన డబ్బుపైకి ధ్యాసపోయింది. చూసేటప్పటికి ఆశ్చర్యం! అక్కడ రెండు వందరూపాయలనోట్లుతప్ప తక్కినడబ్బంతా మాయమైవుంది. ఇది కనకాంగిపనే. తాను పెట్టెలో డబ్బుపెట్టి, తాళంకోసం బజారు వెళ్ళినపుడు ఈపనిచేసివుండాలి. ఈ రెండువందలరూపాయలతో పడవలసిన అగచాట్లుపడి మళ్లీ కొంపకుచేరుకోడానికి సరిపోతుందని వుంచివుంటుంది, ఆమెకు అమితకోపం వచ్చింది కనకాంగిమీద. కాని యేంచేయగల దిప్పుడు?

ఆమె నోటుబుక్కులో వొక కాగితంచింపి, అతనికిచ్చి నోటుబుక్కు ఒత్తుకు అందిచ్చింది. అతడు వుత్తరంవ్రాసి ఆమె చేతికిచ్చాడు. నోటుబుక్కును కుర్చీమీద పెడుతూ "నేనామెను స్వయంగా కలుసుకోడానికి వ్యవధిచాలదు. ఈరాత్రి బోట్ మెయిల్లో నేను కొలంబో వెడుతున్నాను. అక్కడినుండి

సింగపూరు వెడతాను. సింగపూర్‌లో నా వ్యాపారమున్నా.. వ్యాపారంమీద అక్కడ కొంతకాలం వుండవలసివస్తుంది” అన్నాడు.

పంకజ ఆ వుత్తరాన్ని సాంతం చదివింది. “మీ పేరు గురుప్రసాదా...?” అని అడిగింది.

“అవును. అసలు నాది విజయనగరం. వ్యాపారంమీద అన్ని వూళ్ళూ తిరుగుతుంటాను” అన్నాడు.

“ఇక్కడికి కెప్పుడు వచ్చారు?”

“ఇవ్వాళే. ఈ హోటల్లోనే 36వ నంబరుగదిలో దిగాను. ఇందాక హోటల్లో చూచి, మొదట నీవా కావా అని సందేహించాను. తరువాత రూఢిఅయింది” అన్నాడు.

“ఈవాళ దేవుడిలా మీరు కనుపించారు. నా దగ్గర కొంతడబ్బున్నదన్న ధైర్యంతో యిక్కడే కొంతకాలం వుండి, వుద్యోగప్రయత్న మేదైనా చేద్దామనుకున్నాను. కాని, ఆ డబ్బుపోయిందని యిప్పుడే తెలుసుకున్నాను...”అంది. అతడు తనకు ఆత్మబంధువుకన్నా అధికమైనాడు. అతనితో తనకష్టాన్ని చెప్పకోకుండా వుండలేకపోయింది.

అతడు తనపర్సులోంచి అయిదు వందలరూపాయల నోట్లు తీసి, ఆమెకివ్వబోతుంటే, పంకజ ఆశ్చర్యంతో “మీరు యింతడబ్బు...” అని సగంలోనే ఆగిపోయింది.

“వృధాగా తగలెయ్యడంలేదు సద్వినియోగమే చేస్తున్నాను. ఈసారి దీన్ని నీవు స్వీకరించకతప్పదు” అన్నాడు. పంకజ జవాబు చెప్పలేకపోయింది. చెమ్మగిల్లినకళ్ళతో ఆడబ్బు స్వీకరించింది.

'శ్యామలాంబగారిని వెళ్ళి తప్పకుండా కలుసుకో. నే నింక శెలవు తీసుకుంటాను. నాభార్య నాకోసం యెదురుచూస్తూ వుంటుంది. నేను సింగపూరునుంచి వచ్చాక, నిన్ను తప్పకుండా చూస్తాను" అని అతడు వెళ్ళిపోయాడు.

ఇంతసేపూ సముద్రంలా అల్లకల్లోలంగావున్న ఆమె మనస్సెందుకో ఇప్పుడు స్థిమితాన్ని కోరుకుంటున్నట్టనిపించింది. వెళ్ళి గదితలుపులు మూసివచ్చి, అలసిపోయినశరీరంతో మంచం మీద ఒరిగిపోయింది.

# 13

కాశీఅన్నపూర్ణాదేవి దేవత. మద్రాసు మైలాపూర్‌లో వున్న శ్యామలాంబ మానవస్త్రీ, అంతే భేదం. అతిథిసత్కారం లోనూ, ఆశ్రితరక్షణలోనూ యిద్దరూ సమానులే.

పంకజ పొద్దున్నే స్నానంచేసి, కాఫీ ఫలహారం తీసు కుని శ్యామలాంబయింటికి వెళ్ళడానికి మైలాపూర్ బస్ యెక్కింది. గురుప్రసాద్ రాసియిచ్చిన వుత్తరాన్ని బస్సులో కూడా నాలుగైదుసార్లు చదివింది. గురుప్రసాద్ ఆ వుత్తరాన్ని యెంతో స్పష్టంగా అభిమానంతో రాశాడు. ఆ వుత్తరంలో తనకులంప్రసక్తి యెక్కడా తేలేదు. తననుగూర్చి చాలా నేర్పుగా చెప్పాడు. తనతో అతనికి వొక సందర్భంలో పరి చయమైనదనీ, తన కెవ్వరూ దిక్కులేరనీ, యెంతోకష్టపడి యింటరుచదివి, వున్న కొద్ది డబ్బుతో యిక్కడికి మెడిసన్ చదవడానికి వచ్చిందనీ, మెడికల్ కాలేజీలో సీటు దొరకలేదనీ, తగిన వుద్యోగం యేదైనా దొరికితే చేరాలనివుందనీ, మీరు

తప్పకుండా యిందుకు సహాయంచేయవలసిందనీ వ్రాశాడు. తరువాత ఆమె యోగక్షేమాలను విచారిస్తూ, తన యోగక్షేమాలు తెలిపి, తాను సింగపూరు వెడుతున్నాననీ, తిరిగి వచ్చినప్పుడు కలుసుకుంటాననీ, ఇప్పుడు రాలేకపోయినందుకు క్షమించకోరుతూ ఉత్తరం ముగించాడు. అతడు రాసినపద్ధతి ఆమె కెంతో ముచ్చటగావుంది. బస్సుదిగేలోపల మరిరెండు సార్లు చదివిం దా వుత్తరాన్ని. బస్సు మైలాపూర్ చేరింది.

మైలాపూర్‌లో శ్యామలాంబగారియిల్లు వెతుకోడం ఏమంత కష్టమనిపించలేదు పంకజకు. ఆమె గేటుదగ్గరకు వెళ్లేటప్పటికి పూలమొక్కలు సవరిస్తున్న తోటమాలి చూచాడు పంకజను.

"అమ్మగారికోసం వొచ్చారా? అమ్మగారు పూజచేసుకునేవేళ యిది. అట్లా యెళ్లి హాల్లో కూకోండి, కాస్సేపట్లో వొస్తారు" అని ఆమెను తీసుకెళ్ళి హాల్లో వొకసోఫామీద కూర్చోబెట్టాడు. కొన్నిక్షణాలు గడిచినై. తన కెదురుగా సోఫాలోకూర్చున్న యువకుడెవరో రెప్పవాల్చకుండా తన కేసి చూస్తూండడం గమనించింది. తలయెత్తి వొక్కసారి అతని ముఖంలోకి చూచింది. అబ్బ! యెంత స్ఫురద్రూపి! అనుకున్నది. యెత్తుగా మన్మథసింహాసనంలావున్న వక్షస్థలం, శిఖరాల్లా మూపులు, విశాలమైనకళ్ళు, మనుచరిత్రలోని ప్రవరాఖ్యునిస్వరూపాన్ని జ్ఞప్తికితెచ్చాయి. యెందుకో, యెంతప్రయత్నించినా మాటిమాటికి అతనికేసిచూడకుండా వుండలేకపోయింది. ఆమెరక్తం పొంగులువారుతున్నది. నొసటిమీద చెమటబిందువులు సన్నగా ఆవరిస్తునై. గుండెకూడా వేగంగా

కొట్టుకోనారంభించింది. యేమిటి తన కీ వికారం! తన్నుతాను మరచిపోయి, అతనివంక చూస్తూ కూర్చుంది. యూవనోద్రేక మహాప్రవాహంలో సంక్షోభపడిపోయి, ప్రకృతిలా దీనంగా చూస్తుంటే, తన్ను తనలో లీనంచేసుకోడానికి చూస్తూన్న ఆది పురుషునిలా కనుపించాడప్పుడతడు.

"నీవా భాస్కరం! వచ్చి చాలాసేపైందా?" అన్న మాటలు విని యిద్దరికీ చైతన్యంకలిగింది. సోఫాలో సర్దుకుని కూర్చున్నారు. ఆ పలుకరించింది శ్యామలాంబగారు. బంగారు వన్నె శరీరచ్ఛాయ. సుమారు నలభై అయిదుసంవత్సరాలు వుండవచ్చు. తెల్లని పట్టుచీరకట్టుకుని స్వర్ణ సరస్వతిలా వచ్చి పంకజ కూర్చున్న సోఫాలోకూర్చుని, పంకజతల నిమురుతూ "ఎవరీ అమ్మాయి? నీవు తీసుకొచ్చావా భాస్కరం?" అని అడిగింది. అత నేమీ జవాబుచెప్పలేదు. పంకజకూడా యేమీ మాట్లాడలేకపోయింది. తనచేతిలోవున్న వుత్తరాన్ని శ్యామలాంబకు యిచ్చింది. శ్యామలాంబ ఆ వుత్తరాన్ని చదువుతుంటే తలవంచుకుని కూర్చున్నది. వుత్తరాన్ని పూర్తిగా చదివాక శ్యామలాంబ "ఎక్కడదిగావమ్మాయ్...?" అన్నది.

"హోటల్లో..."

"సరేగాని, సాయంకాలం వెళ్ళి, నీ పెట్టెబేడా యిక్కడికి పట్టించుకురా..." అంటూ "భారతీ, భారతీ!" అని పిలిచింది. వెంటనే వొక పన్నెండేళ్ళమ్మాయి అక్కడికి వచ్చింది "ఏమిటమ్మా?" అంటూ.

"చూడు. అక్కయ్యను లోపలికి తీసుకెళ్ళు"

భారతి పంకజను తనతో లోపలికి తీసుకెళ్ళింది. లో

లికి వెడుతూ, వొక్కసారి వెనుదిరిగి భాస్కరంవంక చూడకుండా వెళ్ళలేకపోయింది పంకజ. అతనిపేరు భాస్కరం. తనపేరు పంకజ. ఏమి టీ బాంధవ్యం! యెందుకు తనమనసట్లా వికసించింది అతణ్ణిచూడగానే? ఆమె ఇలా తనకుకలిగినఅనుభూతిని గురించి ఆలోచిస్తూనే లోపలికివెళ్ళింది.

*　　*　　*　　*

పంకజ ఆ యింటికి వచ్చి అప్పుడే నెలరోజులు కావొస్తోంది. శ్యామలాంబఆజ్ఞానుసారం ఆనాటి సాయంకాలమే పెట్టెబేడా హోటల్లోంచి తీసుకొచ్చేసింది. ఆ యింట్లో తిమ వునికి యెవరికీ పట్టింపులేనట్టువుంది. వొక్క భోజనాలదగ్గర తప్ప శ్యామలాంబనుచూడడానికే వీలుపడటంలేదు. ఈ నెల రోజుల్లో శ్యామలాంబభర్త రాఘవయ్యగారు రెండుసార్లో యేమో తనను చూచినట్టుంది. తనను దూరాన్నుంచి చూపించి శ్యామలాంబ యేదో చెప్పింది. ఆయన తలవూపాడు, అంతే. ఆ దంపతులకిద్దరికీ కోర్టువ్యవహారాల్లో వూపిరి సలపడానికి వీల్లేకుండావుంది. వారికి భారతితప్ప వేరే సంతానం వున్నట్టులేదు. మధ్యాహ్నం భారతి స్కూలుకి వెళ్ళిపోతుంది. ఇంటిదగ్గర రాఘవయ్యగారివితంతుసహోదరి మాత్రం వుంటుంది. ఆమెకు గృహనిర్వాహణంలోనే కాలమంతా గడచిపోతుంది. తీరికదొరికినప్పుడు యే భాగవతమో చదువుతుంది. ఆమె మితభాషిణి. యెవరూ 'నీవెవరు? యెందుకిక్కడికి వచ్చావ'ని వొక్కనాడూ పంకజ నడుగలేదు. ఆ లా యింట్లో పనివాళ్ళదగ్గరనుండీ అతిథులను సత్కరించడమే గాని, వాళ్ళవిషయాలు ఆరాతీసేఅలవాటు యెవరికీ లేనట్టువుంది.

భారతికి తనదగ్గర చనువు యెక్కువైపోయింది. తనదగ్గరే చదువు కుంటుంది. తనచేతనే జడవేయించుకుంటోంది. తనదగ్గరే పడు కుంటోంది.

యెందుకో పంకజహృదయం బాధపడసాగింది. తను కనకాంగికూతురన్న సంగతి జ్ఞాపకంరాసాగింది. తనసంగతి యెవ్వరికీ తెలియదుకాబట్టే, అందరూ తనను ఆదరిస్తున్నారను కుంది. ఆ పవిత్రగృహంలో తనకు స్థానంలేదనుకుంది.ఆయింట్లో యెవరికీ యెదురుపడలేకుండావుంది. శ్యామలాంబ తనకు తగిన వుద్యోగం యేదైనా చూపిస్తే, ఆయింట్లోనుండి వీలైనంత త్వరలో వెళ్ళిపోవాలనుకున్నది. కాని, శ్యామలాంబను తీరి కగా కలుకునేదెప్పుడో! ఆమె తనను పూర్తిగా మరచిపోయి నట్టుంది!

ఒకనాడు భారతినినిద్రపుచ్చి, తాను పడుకోబోతూ వుంటే, శ్యామలాంబ ఆగదిలోకి వచ్చింది. పంకజ లేచి నిల బడింది.

"నీవువచ్చి నెలరోజులైనా, నీతో తీరికగా మాట్లాడు దామంటే వీల్లేకుండావుంది. ఒక నుడతపేచీల కేసులో వూపిరా డడంలేదు. ఈయింట్లో నీకేమీ లోపంజరగడంలేదుకదూ?" అన్నది శ్యామలాంబ.

ఆయింట్లో తనకు లోపంజరగడమా! పంకజ శ్యామ లాంబ సుందర సౌమ్యమూర్తినిచూస్తూ నిలబడిపోయింది. తన ఫలానాఅని ఆమెతో చెప్పివేస్తే మంచిదని అంతరాత్మ ప్రబోధిస్తోంది.

"నాగురించి మీతో కొంత చెప్పాలి. మీరు..."

"శ్యామలాంబ నవ్వింది.

"నాకు వినాలని కుతూహలంలేదు. నాకు నీవొకటి మా భారతి వొకటీ కాదు. ఈయింట్లో నీ కేకొరతా వుండదు. నేను అలసిపోయున్నాను మరొకప్పుడు మాట్లాడుకుందాంలే" అంటూ ఆవలిస్తూ వెళ్ళిపోయింది.

పంకజ యింకేమీ అనలేకపోయింది.

*　　　*　　　*　　　*

పంకజను భాస్కరాన్ని గురించిన ఆలోచనలు వదల కుండావున్నాయి.

పంకజ వొకనాటిసాయంకాలం భారతితో సముద్రతీరానికి వెళ్ళింది. భారతిని అడిగింది భాస్కరాన్ని గురించి. "ఓ అన్నయ్యా! "లా" ఆఖరుసంవత్సరం చదువుతున్నాడు. Y. M. C. A. లో వుంటాడు. మా నాన్న దగ్గర పనినేర్చుకోడానికి వస్తూంటాడు" అని మూడుముక్కల్లో చెప్పేసింది. చెప్పి దూరాన యెవర్నో చూచిసంతోషాన్ని వెలిబుచ్చుతూ "అడుగో భాస్కరంఅన్నయ్య" అని, "భాస్కరంఅన్నయ్యా! భాస్కరం అన్నయ్యా!" అని చప్పట్లుకొడుతూ పిలిచింది. భాస్కరం బీచ్ కి షికారువచ్చినట్టున్నాడు వొక్కడే. లాల్చీ, పైజామా వేసుకుని, సిగరెట్టు కాలుస్తూ వస్తున్నాడు. భారతిపిలుపు విని అక్కడికి వచ్చాడు. వారికిసమీపంలోనే కూర్చున్నాడు సిగరెట్టుపారేసి. కొన్నిక్షణాలు ముగ్గురూ మౌనంగా కూర్చు న్నారు. వున్నట్టుండి భారతి వొక్కగంతువేసి నీళ్ళదగ్గరకు పరుగెత్తింది.

పంకజ కేం చేయాలో తెలియలేదు. యిసుకమీద గీతలుగీస్తూ కూర్చుంది. భాస్కరంకూడా మౌనంగానే కూర్చున్నాడు. సముద్రంమీదినించివచ్చే హోరుగాలికి అల్లాడిపోతున్న ఆమె ముంగురులు చూస్తూ కూర్చున్నాడు. ఆమె పైట పతాకంలాగా పైకెగిరి మళ్లీ కిందపడుతోంది. ఆమెకన్నులలో చాంచల్యం అతని హృదయాన్ని కదిలిస్తున్నట్టు వక్షస్థలం ఊర్పులతో పైకీ కిందికీ కదులుతోంది.

"మీరు శ్యామలాంబ కేమౌతారు?"

అదేమిటో ఈ ప్రశ్న యిద్దరి నోటినుండీ వొక్కసారే బయటకు వచ్చింది. యిద్దరికీ నవ్వువచ్చింది.

"నాకు శ్యామలాంబగారు దూరపు బంధువు. అదీకాకుండా కుటుంబస్నేహితులు. వారిదీ మొదట మా రాజమహేంద్రవరమే. నేను "లా" ఫైనల్ యియర్ చదువుతున్నాను. పనితెలుసుకునే విషయమై వారింటికి తరుచు వస్తుంటాను. శ్యామలాంబా రాఘవయ్యల ఆదరణలో మా తలిదండ్రులకు దూరంగా వుంటటాన్నికూడా మరచిపోతున్నాను- మరి మీరో?" అన్నాడు.

అతడు తనవిషయాలను చెప్పుకున్నంతధైర్యంగా తనను గూర్చి అతనితో చెప్పుకోలేనని అనుకున్నది పంకజ.

"నేనొక అనాథను" అంది అంతకంటే యేమీ చెప్పలేకపోయింది. ఆమె కంఠం రుద్ధమైపోయింది. కళ్లు చెమ్మగిలినై. అతనివైపు చూడలేక ముఖాన్ని పక్కకు తిప్పుకుంది.

"క్షమించండి, మిమ్మల్ని అడగరాని విషయాలడిగి, మీ మనసుకు కష్టంకలిగించినట్టున్నాను" అన్నాడు. ఇంతలో

సగంతడిసిన పావడాతో భారతి వచ్చిం దక్కడికి. అప్పటికే చీకట్లు కమ్ముకున్నాయి. భారతి సోదామంటే, ముగ్గురూ బయలు దేరారు. భాస్కరం వాళ్ళను యింటిదగ్గర దిగబెట్టి మరీ వెళ్ళాడు. ఆమె మనస్సూ, ఆలోచనలూ అతనితోనే వెళ్ళినాయి.

*　　*　　*　　*

ఒకనాటిరాత్రి ఆమె భారతినినిద్రపుచ్చి, తాను పడుకో బోతూంటే శ్యామలాంబ వచ్చింది. మళ్లీ వెనుకటి ప్రశ్నే అడిగింది.

"ఈయింట్లో నీకేమీ లోపంజరగడంలేదుకదా?" అని. పంకజ యేమీజవాబు చెప్పలేదు. లేదన్నట్టుతలాడించి, చిన్నగా నవ్వుతూ శ్యామలాంబముఖంలోకి చూస్తూ నిలబడింది. శ్యామ లాంబ వొక్కక్షణం పరీక్షగా పంకజముఖంలోకిచూచి, "నీకు కేవలం మెడిసన్ చదవాలనేవుందా?" అని అడిగింది.

"అవును. మెడిసన్ చదవడంకంటే యీప్రపంచంలో నేనేమీ చేయలేననిపిస్తోంది. కాని యిప్పుడా ఆశ వదులు కున్నాను" అంది పంకజ.

"ఎందుకని ?"

"చేతిలో కొంతడబ్బువున్నదన్న ధైర్యంతో యిక్కడికి వచ్చాను. కాని, నా దురదృష్టవశాత్తు దాన్ని పోగొట్టు కున్నాను. నాకుతగినవుద్యోగం యేదైనా చూపించండి. ఎంత కాలమని భరిస్తారు?"

"యేజన్మలోనో సంబంధంలేనిదే మానవులు వొకరి

దగ్గరవాళ్ళరుండరు. నాకు నీవొకటి, మా భారతివొకటి కాదని నిన్ను మొదటగా చూచినప్పుడే నిశ్చయించుకున్నాను" అన్నది శ్యామలాంబ.

"నిర్మొహమాటంగా యెన్నాళ్ళనిగడపను?" అంది పంకజ.

"నీవు తెలుగు చక్కగా వ్రాయగలవా?"

"ఆ"

"నేను 'నారీలోకం' అన్న పత్రిక ప్రారంభించబోతున్నాను. అందుకు నీవు నాకు చేదోడుగా వుండు."

పంకజ కెందుకో కళ్ళల్లో నీళ్ళు తిరిగినై. తనయందు ఇంత వాత్సల్యాన్నీ, ఆదరణనూ చూపిస్తున్న శ్యామలాంబగారికి తను యెవరో తెలియజేయకుండా వుండడం ఎలా? నిజంగా ఆ యింట్లో ప్రతివారు తనపట్ల చూపే ఆదరాభిమానాలు మహాభారమవుతున్నాయి. తన్ను గూర్చి నిజం చెప్పెయ్యాలని యెన్నిసార్లు ప్రయత్నించినా అవకాశం లభించడంలేదు. విధివశాత్తు యెప్పుడైనా బయటపడితే తన నందరూ మోసగత్తె అనరూ? ఇంక ఏమైనాసరే, శ్యామలాంబతో చెప్పక తప్పదు అనుకొని, బయటకు వెళ్ళబోతున్న శ్యామలాంబతో,

"ఒక సంగతి......" అన్నది.

"ఏమిటది?..." అని వెనక్కు తిరిగింది శ్యామలాంబ.

"నాగురించి కొన్ని సంగతులు మీతో చెప్పాలి..."

"ఏమిటది...?" అన్నది మళ్ళీ శ్యామలాంబ.

"మీరు నన్ను క్షమించగలరా...?" అన్నది పంకజ డగ్గుత్తికతో.

"దేనికి? నీ వేదైనా తప్పుచేశావా...?"

"లేదు...కాని......" అంది పంకజ.

శ్యామలాంబ నవ్వింది. నిండుగా, ప్రసన్నంగా, భూదేవిలా నవ్వింది ఆమె.

"నీవు తప్పుచేయనప్పుడు నీకు భయందేనికి? నాకు తక్కినవిషయాలు వినాలనిలేదు. నాకు నీవొకటి, భారతివొకటి కాదు..." అంటూ వెళ్ళిపోయింది.

*　　　*　　　*

పంకజ తాను భాస్కరుని చూచినప్పుడుకలిగిన అనుభూతి రహస్యాన్ని గురించి ఆలోచిస్తోంది. తను మద్రాసుకు వచ్చాక జరిగినసంగతంతా విశదంగా నర్మదకు వుత్తరంద్వారా తెలియజేసింది పంకజ. శర్మనుగురించికూడా అడిగింది. నర్మద జవాబువ్రాసింది. కాలేజిలో సీటుదొరక్కపోవడానికీ, డబ్బు పోగొట్టుకున్నందుకూ సంతాపాన్ని వెలిబుచ్చుతూ, శ్యామలాంబగారి ఆదరణ లభించినందుకు తనసంతోషాన్ని వెలిబుచ్చింది. శర్మ ఇప్పుడు తననుపూర్వప్రేమతో చూస్తున్నాడనీ, తాను తల్లి కాబోయేసూచనలు కనిపిస్తున్నాయనీ, శర్మ కాలేజి ట్యుటోరియల్ సక్రమంగా సాగిస్తున్నాడనీ వ్రాసింది. పంకజకు కొంత శాంతి చేకూరింది ఆ వుత్తరంతో.

పంకజ నెలరోజులనించీ శ్యామలాంబగారిఇంట్లో ఉండడంలేదు. శ్యామలాంబ నారీలోకం కార్యాలయం లజ్ సమీపంలో వొకమేడ అద్దెకుతీసుకుని అందులోపెట్టింది. ప్రెస్సుకూడా కొన్నది. పంకజ ప్రెస్సుపనులూ, పత్రికపనులూ నిర్వహించుకుంటూ, ఆ మేడమీదే వుంటోంది. అక్కడే పడుకుంటుంది. ఆమెకు శ్యామలాంబయింట్లోకన్న యిక్కడ వొంట

రిగాల్ల గదులమే హాయిగా వుంటోంది. శ్యామలాంబ తీరినప్పు డల్లా అక్కడికి వచ్చి, పర్యవేక్షణచేసిపోతుంది.

భాస్కరం తరుచూ వస్తున్నాడు ప్రెస్సుకు. స్త్రీలఅభ్యు దయాన్నిగురించి వ్యాసాలూ, కథలూ తెచ్చియిస్తాడు. పంక జతో చాలాసేపు మాట్లాడుతూకూర్చుంటాడు. ఆర్థికంగా, సాంఘికంగా, నైతికంగా ప్రస్తుత స్త్రీలస్థితినిగూర్చి, రావలసిన మార్పులనుగురించి విసుగులేకుండా మాట్లాడుతుంటాడు. అతని వాగ్ధోరణిలోని సున్నితమైనహాస్యాన్నీ, సౌజన్యాన్నీ గుర్తిస్తూ వింటూ కూర్చునేది పంకజ. అతనిచూపులు ఆమెశరీరంమీద పాకుతూ గగుర్పాటుకలిగించేవి. కొన్నిసమయాల్లో ఉద్రేకంలో బల్లగుద్ది చెబుతోంటే ఆమెకు పట్టరానినవ్వువచ్చేది. అతడు తన ముందు యెంతసేపు కూర్చున్నా ఆమెకు విసుగుకలిగేదికాదు. అతడు మాట్లాడుతుంటేఅతనిపెదిమలవంపులను,యెత్తైనవక్షాన్నీ చూస్తూ కూర్చునేది. అతణ్ణిచూచేటప్పటికి ఆమెకు తనశక్తు లన్నీ అణగిపోయినట్లనిపిస్తుంది. "నీవు నన్నువివాహంచేసు కుంటావా ?" అని అతడుగనుక తన నడిగితే, శర్మకు తాను చెప్పినట్లు యితనితో అనడానికి తనకు ధైర్యంచాలదనిపించేది పంకజకు.

ఒకనాడు తనహృదయంలో ప్రేమమందిరాన్నినిర్మించి, అందులో శర్మఅనేదేవతను ప్రతిష్ఠించి ఆరాధించబోతూవుంటే మందిరము అందులోనిదేవతకూడ నర్మదఅన్ననదీప్రవాహంలో కొట్టుకుపోయినై. తను బైరాగిలా నిలబడిపోయింది. యిప్పు డితడు తనహృదయాన్ని బలంగా ఆకర్షిస్తున్నాడు. యెందుకో

ఆమెమనస్సులో శర్మ నవ్వినట్లనిపించింది. ఆమెహృదయం కలవరపడింది.

♦ ♦ ♦

ఒకనాడు శ్యామలాంబ పంకజను తనయింటికి పిలిపించింది. ముద్రణాలయనిర్వహణ, పత్రిక బాగోగులనుగురించి కొంతసేపు మాట్లాడి,

"నీవు భాస్కరాన్ని బాగా యెరుగుదువుగదూ?" అన్నది.

అవునన్నట్టు తలవూపింది పంకజ.

"అతనికి నిన్ను వివాహంచేసుకోవాలని వుందట. నీ వుద్దేశమేమిటి? బాగా ఆలోచించి చెప్పు. అతనికి నీ గతంతో గానీ, కులగోత్రాలతోగానీ, అంత పట్టింపు లేదు. అతని తల్లిదండ్రులుకూడా అతనియిష్టాన్ని కాదనరు. నా అభిప్రాయంలో భాస్కరాన్ని నీవు చేసుకోవడం యెంతో అదృష్టం. భాస్కరం లాంటి గుణవంతులైనయువకులు యీరోజుల్లో చాలాఅరుదు. అతనివల్ల నీ కెలాంటికష్టమూ వుండదు. మీరిద్దరూ దంపతులైతే మీది సుఖసంసారంకాగలదని నా విశ్వాసం..." అని పంకజను నోరెత్తనీయకుండా చెప్పింది శ్యామలాంబ.

"నాకేమీ అభ్యంతరంలేదు" అన్నది పంకజ వేగంగా కొట్టుకుంటున్న గుండెతో—

అతడు భాస్కరుడు, తాను పంకజ. పంకజ తనకు భాస్కరానికి కలుగనున్న సంబంధాన్నిగురించి ఆలోచిస్తూ యింటికి వచ్చింది. భాస్కరం గడపముందే నిలబడి తనరాకకోసం చూస్తున్నాడు. అప్పుడే వుదయించిన సూర్యబింబంలా నవ్వుతున్నాడు తననుచూచి. ఆమెహృదయం కమలంలావికసించింది.

# 14

పంకజ వూరుకుండలేక వొకనాడు తీరికగా కూర్చుని కనకాంగికి వుత్తరం రాసింది. అందులో తనకు తెలియకుండా, తన పెట్టిలోవున్న డబ్బును కాజేసిన నీచపుపనికి ఆమెను నిందిస్తూ, తనకు దేవుడు సహాయపడ్డాడనీ, తన కింక ఆమె ఆశ్రయం అక్కరలేదనీ, యింతకాలం తనను పోషించినందుకు తను కృతజ్ఞురాలిననీ, ఆమె నికనైన ఆ నీచవృత్తిమాని, వున్నది తింటూ సన్మార్గంలో గడపవలసిందనీ, తనకు ఫలానావారి ఆశ్రయం లభించిందనీ, దేవుని దయచేత తాను వొక యువకుని వివాహం చేసుకోబోతున్నాననీ వ్రాసింది.

తీరా వుత్తరం వ్రాసి పోస్టులో పడేసిన తరువాత ఆమె వేలు కొరుక్కుంది. తాను కనకాంగి కసలు వుత్తరమే వ్రాసి వుండవలసిందికాదు. రాసినా అందులో తన అడ్రసు ఇవ్వకుండా వుండవలసింది. ఇప్పుడేమనుకొని యేంలాభం! అంతా చెయిజారిపోయింది. ఆ వుత్తరం కనకాంగికి తప్పకుండా అంది తీరుతుంది. రెక్కలమీద వచ్చినట్టు యిక్కడికి వచ్చివాలి తీరుతుంది కనకాంగి. యెందుకనో కనకాంగి తప్పకుండా వచ్చి తీరుతుందనే పంకజకు తోచింది. ఆమె లోపలలోపలనే దిగులు పడసాగింది.

తను కనకాంగివస్తే యేంచేయడం? తను సానికూతురని తెలిస్తే భాస్కరం తనను చేపట్టుతాడా? ఈ ఆలోచనతో ఆమెహృదయం వణకసాగింది. ఆమె భయానికి తగినట్టుగానే జరిగింది. ఆదివారం ఉదయాన్నే యేడున్నరకల్లాయింటిముందు

టాక్సీవచ్చి ఆగింది. మొహరోనని మేడమీదినుంచి చూస్తూంటే, అందులోంచి కనకాంగి దిగింది. కారువాడితో యేవో బేరాలాడి అతనిచేతిలో డబ్బులుపెట్టి, వొక సూటుకేసు చేతపట్టుకుని మేడ పైకివచ్చింది. పంకజకు నోటమాటరావడంలేదు. విస్తుపోయి చూస్తూ అలాగే నిలబడిపోయింది.

"ఏమమ్మా పెండ్లికూతురా! యెందు కంత ఆశ్చర్యంగా చూస్తావు? నేను మీ యమ్మనే. యింకెవర్నీ కాను" అంది చేతులు తిప్పుతూ కనకాంగి. పంకజ యేమీ మాట్లాడకుండా లోపలికివెళ్ళింది. కనకాంగి ఆమె ననుసరించింది.

పంకజ తల్లికి కాఫీయిచ్చి, స్నానానికి నీళ్ళుకాచి తోడింది. తొందరగానే వంటచేసి కనకాంగికిపెట్టి, తానూ తిన్నది. వండినవి చాలా మిగిలిపోయినట్లు తోచింది పంకజకు రాత్రికి వేరే వంటచేయనక్కరలేదని నిశ్చయించుకున్నది. ఇంత సేపూ ఆమె మౌనంగానే వుంది. ఆమెమనస్సు వికలమైవుంది.

రైలుప్రయాణంతో అలసిపోయిన కనకాంగి పంకజ మంచంమీద మేనువాల్చింది. వంటింటిపని ముగించుకుని, పంకజవచ్చి పడకకుర్చీలో మేనువాల్చి ఆలోచిస్తోంది. కూతురు మౌనాన్ని సహించలేకపోయింది కనకాంగి. తానే ప్రారంభించింది వుపన్యాసం.

"ఇదేం మాయదారిపట్టణమే! స్టేషన్‌నుంచి యిక్కడికి రావడానికి ఆరుబిళ్ళలా? కొత్తవాళ్ళనిచూచేటప్పటికి కాకుల్లా పీక్కుతింటారు. ఆ కాస్త పెట్టె రైల్లోనించి కారులోపెట్టడానికి కూలివాడికి అర్ధరూపాయా? యేమో తల్లీ! నీ వెట్లా నెగ్గుకొస్తున్నావో యేమో! నేనైతే వొక్కక్షణం వుండలేను.

ఆ దేశంగేసు, ఎంతైనా కన్నతల్లి నిగదా, నిన్ను చూడాలని యింత దూరం వచ్చానుగదా! నాతో వొక్కమాటైనా మాట్లాడ వేమే? నీ డబ్బుతీశానని కోపమూ నామీద. నీతో చెప్పకుండా తీయడం నాపొరపాటే, వొప్పుకుంటాను. అంతడబ్బుతో వొంటరిగా బయలుదేరావావెను మరి. యెవడైనా పెట్టి ఉడాయించుకుపోతే నీగతి యేంకాను చెప్పు? అందుకని తీసి దాచాను. ఈ విషయం ముందే చెబితే నీవు వినేదానివేనా? నీవు మద్రాసువెళ్లి నాకు వుత్తరంరాస్తావు, తరువాత ఆడబ్బు నీకు పంపిద్దాముగదా అనుకున్నాను. మొన్నటిదాకా నీజాడైనా తెలిస్తేగా. నీ వుత్తరం వచ్చిందో లేదో. వుండబట్టలేక యిట్టే వచ్చేశాను. నీ రెండు వేలూ బ్యాంకులో భద్రంగా వుంది. నీకేం భయంలేదు. పోనీ, యీసంగతులు కేంగాని, నా కాబోయే అల్లు డెవరో, నా వియ్యాలవారెవరో యింతవరకూ చెప్పనే లేదేమ? అమ్మో! అదేమిటే, అడుగుతుంటే బదులు చెప్ప వేమే? పోనీలేమ్మా! నీవు చెప్పకపోతేమానె; విదియనాడు కనపడని చంద్రుడు తదియనాడు దాగుతాడా" అంటూ పక్కకు తిరిగి కళ్ళుమూసుకుంది. క్షణంలో గురక మొదలుపెట్టింది. వంకజ ఆలోచిస్తూ అలాగే కూర్చుంది.

సాయంకాలం నాలుగున్నరకు భాస్కరం వస్తానని చెప్పాడు. ఆ సాయంకాలం అడయారు కళాక్షేత్రంలో రుక్మిణీ దేవినృత్యం చూద్దామని అనుకున్నారు. అతడు తప్పకుండా వస్తాడు; కనకాంగిని చూస్తాడు. తాను కనకాంగియెవరో అతనితో చెప్పకపోయినా, కనకాంగివాలకమే ఆమె ఫలానాఅని బయటపెడుతుంది. అప్పుడు తనగతేమిటి? ఇంతకాలం ఈ

విషయం దాచిపెట్టినందుకు తనను మోసకత్తెఅనడూ? తాను తనపుట్టుపూర్వోత్తరాలు దాచాలని యెన్నడూ ప్రయత్నించ లేదు. పరిస్థితులు ఆ విషయాన్ని బయటపెట్టనీయలేదు. తాను యిప్పుడు హఠాత్తుగా బయటపడితే తనపరిస్థితి యెంత అస హ్యంగా తయారవుతుంది! ఆమెగుండె దడదడ కొట్టుకోసాగింది. కనకాంగిని భాస్కరంకంటపడకుండా యెలా తప్పించడం? అని ఆలోచిస్తోంది పంకజ.

శ్యామలాంబగారు వూళ్లో లేరు. కలకత్తాలో జరుగు తున్న అఖిలభారతమహిళాసభలో పాల్గొనడానికి ఓగాంతిని కూడా వెంటతీసుకువెళ్లింది. తాన తిరిగివచ్చేలోగా ముహూ ర్తం నిశ్చయమైతే తనకు కలకత్తాకు రాయవలసిందనీ, ముహూ ర్తంనాటికి రాజమండ్రివస్తాననీ చెప్పివెళ్లింది. తనూ, పంకజా వూళ్లోలేనప్పుడు పత్రికవ్యవహారం చూచుకోడానికి తన స్నేహి తురాలైనదుర్గమ్మను యేర్పాటుచేసివెళ్లింది శ్యామలాంబ. ఈ సమయంలో శ్యామలాంబ వూళ్లోలేకపోవడం వొకందుకు మం చిదేననుకుంది పంకజ. కనకాంగిని వీలైనంతత్వరలో ఇక్కడ్నుంచి సాగనంపాలి. ఈ ఆలోచనలతో మూడున్నరదాటిపోయింది. తాను సిద్ధంగావుండి భాస్కరంకోసం బయటనేయెదురుచూస్తూ, అతడు యింట్లోకిరాకుండా అట్లాగే తీసుకువెళ్ళిపోవాలని నిశ్చ యించుకుందిపంకజ, ఆమె తొందరతొందరగా అలంకరించుకుం టూంటే,కనకాంగినిద్రలేచింది పావుగంటలోపదహారేళ్ళపిల్లలా తయారైందికనకాంగి. ఆమెమంచిఆరోగ్యంగావుంది. శరీరంలో నిగ్గు రవ్వంతైనా తగ్గలేదు. ఆమెకు ఆరోగ్యంసడలినప్పుడు ముసలితనపుఛాయలు బయటపడినా, మళ్ళీ ఆరోగ్యంకోలు

కుసేటప్పటికి ఆమె పడుచుదానిలాగే భ్రమింపజేస్తుంది. ఆమె గాజుబొమ్మలాటిశరీరానికి యిప్పటి వేషధారణ చూస్తే, నవ యువతిలాగే కనిపిస్తోంది. ఆమె వేషధారణ అంతనేర్పుగాచేసు కుంటుంది. పంకజకే ఆశ్చర్యంకలిగింది. నవ్వువచ్చి "ఏమి టిది...?" అంది పంకజ.

"నేనూ నీవెంట వస్తాను..." అంది కనకాంగి.

"ఎక్కడికి...?"

"ఎక్కడికైనాసరే. ఈవూళ్ళో అంతా చూడవలసిం దేగా..."

"నీవు నావెంటరావడానికి వీల్లేదే..."

"మరి యింట్లో వొక్కదానికి నాకేం తోస్తుంది?"

"నీవు బీచికివెళ్ళు, దగ్గరలోనే వుంది."

"ఎక్కడుందో నాకేంతెలుసు?"

"రిక్షామాట్లాడుతాలే," అంది పంకజ.

ఇష్టంలేకపోయినా కనకాంగి సరేనన్నది. నాలుగున్నర దాటిపోయినా భాస్కరం యింకా రాలేదు. ఇంటికితాళంవేసి, వున్న రెండుతాళంచెవులలో వొకటి కనకాంగికిచ్చి, వొకటి తనదగ్గర వుంచుకున్నది. రాత్రి తనురావడానికి పొద్దుపోతుంది కాబట్టి, కనకాంగిని భోంచేసి పడుకోమంది. ఒక రిక్షా మాట్లాడి తల్లిని బీచికిపంపించింది. తాను భాస్కరంరాకకోసం యెదురుచూస్తూ గేటుదగ్గరే నిలబడింది.

పహోరుగాలిలో కొండశిఖరంమీద నిలబడ్డట్టు వుంది పంకజస్థితి. కనకాంగిరాకతో పరిశుభ్రమైన తెల్లటిదుస్తులమీద కళ్ళుంపడ్డట్టు బాధపడుతోం దామె.

భాస్కరం యింకా రాలేదు. అతడు రాకపోయినా బాగుండుననుకుంటోంది పంకజ. నిలిచినిలిచి ఆమెకు ప్రాణం విసుగెత్తుతోంది. అతడు యింతవరకూ రాకపోవడానికి కారణ మేమిటో ఆమె వూహించుకోలేకపోతోంది.

ఆఫీసుకు రాత్రిపూట కాపలావుండే జవాను వచ్చాడు. అతడు పొద్దున కనకాంగిరావడం చూచాడు. "నేను లేనప్పుడు వో కామె వస్తుంది. ఆమెను యింట్లోకి వెళ్ళనివ్వు. ఆవిడ మా అమ్మ. యెవరోఅనుకుని తరిమేవు" అని చెప్పింది.

"అలాగే నమ్మగారూ!" అన్నాడు.

ఆరుగంటలకు సరిగ్గా భాస్కరం వచ్చాడు శ్యామ లాంబగారికారులో. ఆగగానే పంకజ యేమీమాట్లాడకుండా వెళ్లి, వెనకసీటులో కూర్చుంది. భాస్కరం కారు స్టార్టుచేశాడు. దారిలో, "ఇంత ఆలస్యంఅయిందేం?" అని అడిగింది పంకజ.

"నేను నాలుగుగంటలకే శ్యామలాంబగారి యింటికి వెళ్ళాను కారుకోసం. రాఘవయ్యగారు ఏదో చెపుతూంటే వదిలించుకునివచ్చేటప్పటికి యింతఆలస్యమైంది" అన్నాడు.

పంకజ యింకేమీ మాట్లాడలేదు. ఆమెమనస్సు మనస్సులోలేదు. భాస్కరం పంకజవంక చూశాడు. ఆమె వాలకం అతనికేమీ అర్థంకాలేదు.

"మనపెళ్లికి ముహూర్తం నిశ్చయమైంది; వచ్చేఆది వారమే ముహూర్తం. వచ్చేగురువారంనాడే మనప్రయాణం" అన్నాడు.

పంకజ మౌనంగా వింటోంది.

యెంతో సంతోషంవెలిబుచ్చుతుందనుకున్నాడు భాస్క రం. కాని ఆమె మౌనానికి అతను విస్తుపోయాడు. "అదేం మౌనంగా వున్నావేం?" అన్నాడు.

"ఏమీలేదు..." అంది నిట్టూరుస్తూ పంకజ. తన కింక పెళ్ళిజరుగుతుందన్నఆశ ఆమెలో దిగజారుతూవచ్చింది. కారు వెళుతోంది. యిద్దరూ మౌనంగానేవున్నారు. కారు కళాక్షేత్రం చేరింది. ఇద్దరూ కారుదిగి హాల్లో ప్రవేశించడమూ, తెర తొలగి శ్రీమతి రుక్మిణీదేవి "అలరిప్పు" ప్రారంభించడం రెండూ వొక్కసారే జరిగినై.

ఇద్దరూ నాట్యంచూస్తూ కూర్చున్నారు. నాట్యానికి ప్రేక్షకులు చాలామంది వచ్చారు. అపూర్వకళావైదగ్ధ్యంలో రుక్మిణీదేవి నృత్యంచేస్తోంది. భాస్కరం రుక్మిణీదేవినిగురించీ, భరతనాట్యాన్నిగురించీ యేమో చెబున్నాడు పంకజతో. పంకజకు నాట్యంమీదగాని, అతడుచెబుతున్న విషయాల మీదగాని లేదు మనస్సు.

"ఇప్పుడు టైమెంత?" అంది విసుగ్గా.

"ఏడుముప్పావైంది" అన్నాడు భాస్కరం రిస్టువాచి చూచి.

"పదండి పోదాం"

"పోదాం! ఆట పూర్తికానివ్వు"

"ఇంక చూడాలనిలేదు నాకు" అంది పంకజ.

పంకజప్రవర్తన అతనికేమీ అర్థంకావడంలేదు. ఇద్దరూ లేచి బయటికి వచ్చేశారు. కారు యువతిలికితీసుకురావడానికి

యిరవైనిమిషాలుపట్టింది. మళ్లీ కారువెడుతోంది. దానిలో "అట్లావున్నావేం?" అని అడిగాడు భాస్కరం.

"ఏమీలేదు..." అని జవాబుచెప్పింది పంకజ. కొంతదూరంవెళ్ళాక "మనపెళ్లి యెప్పుడని అన్నారు?" అంది పంకజ. భాస్కరం విస్తుపోయాడు. "వచ్చేఆదివారం. రేపు గురువారమే మనప్రయాణం" అన్నాడు.

పంకజ వొక్కసారి భాస్కరంముఖంలోకి నిదానించి చూచింది.

"నన్ను గురించి మీవాళ్ళకు యేమనిరాశారు?" అంది,

"నీఅంత అందమైన పిల్ల ప్రపంచంలోనే లేదనీ, నిన్ను తప్ప మరొకపిల్లను పెళ్ళాడననీ" అన్నాడు చిలిపిగానవ్వుతూ.

"నన్ను మీవారెవరూ చూడాలనలా?"

"అన్నారు. కనీసం ఫొటోఅయినా పంపమని వ్రాశారు. కాని నిన్ను నేరుగా తీసుకెళ్ళి వాళ్ళని ఆశ్చర్యపెట్టాలని వూరుకున్నాను."

"మీరు నియోగులా...?"

"అవును"

"నేనెవర్నని మీవారికి రాశారు?"

"శ్యామలాంబగారికి దూరపుబంధువనీ, నాఅన్నవారు యెవరూ లేరనీ, శ్యామలాంబగారి ఆదరణలో వున్నావనీ రాశాను."

"ఈవిషయంలో అబద్ధాలు యెందుకు రాశారు?"

"నాకు నిజంతోపనిలేదు" అన్నాడు.

కారు వెడుతూనేవుంది. పంకజ వున్నట్టువుండి "మీరు నిజంగా నన్ను పెళ్ళాడుతారా?" అంది. ఈ ప్రశ్న అడుగు తుంటే యెందుకో ఆమెకు శర్మ జ్ఞాపకంవచ్చాడు. వొకనాడు శర్మనుకూడా సరిగ్గా యిదేప్రశ్న అడిగింది.

"నీకీ సందేహం ఎందుకు కలిగింది? నేను నిన్నుతప్ప మరొక కన్యను చేపట్టను" అన్నాడతను.

పంకజ భాస్కరంయిచ్చిన జవాబుకీ, శర్మ వొకనాడు తన ప్రశ్నకు యిచ్చిన జవాబుకీ తేడా చూచుకుంటోంది మనసులోనే. శర్మజవాబులో యింత స్థయిర్యం లేదు.

కారు నార్తులోకంఆఫీసుముందు ఆగింది. పంకజ కారు దిగి, "నేను వెడతానింక" అంది పంకజ తనను యింటిలోపలి కాహ్వానిస్తుందనుకున్నాడు. ఆమెవాలకం సాయంకాలంనించీ అతనికి అర్థంకావడంలేదు.

"ఏమి టిల్లావున్నావు?" అని ప్రశ్నించాడు.

"యేమీలేదు. వొంట్లో నలతగావుంది, అంతే-రేపు కనపడుతారుకదూ." అంది. పంకజ కతణ్ణి యింట్లోకి తీసుకు వెళ్ళడం యిష్టంలేదు. లోపలికివెళ్ళింది, ఆఫీసుముందు జవాను బీడీకాలుస్తూ, కూనిరాగంతీస్తూ వొకమూల చీకట్లో కూర్చు న్నాడు. ఆఫీసుద్వారంపక్కనించే మీదికి వెళ్ళడానికి మెట్లు వున్నై. పంకజ మెట్లెక్కుతూండగా వెనకనుండి భాస్కరం వచ్చాడు. "నాకు చాలా దాహంగావుంది కాస్త మంచి నీళ్ళు తాగివెడుతాను." అన్నాడు.

పంకజ యేమీ జవాబు చెప్పలేకపోయింది. కనకాంగి అప్పుడే వచ్చేసినట్టుంది. తలుపు లోపలిగడియ వేసివుంది. లోపల

లైటు వెలుగుతోంది. పంకజ తలుపుకొట్టింది. కాని తలుపు తెరవబడలేదు. నీళ్ళలో కాళ్ళకు నేలఅందనివ్యక్తిలా బాధ పడుతోంది పంకజ. ఆమె ఈలోకంలోవున్న వ్యక్తిలాగా లేదు. భాస్కరాని కంతా అయోమయంగావుంది పంకజస్థితి.

"ఎవరున్నారు లోపల ?" అని అడిగాడు.

పంకజ యేమీా చెప్పలేదు. కోపంతో తలుపుబద్దలయ్యే టట్టుగుద్దింది. కొంత సేపటికి తలుపులు తెరువబడింది. పంకజ, భాస్కరం వొక్కసారే లోపల ప్రవేశించారు. లోపల కన కాంగి, ఆమెపక్కన సత్యనారాయణనుచూాచేటప్పటికి పంకజకు అమితఆశ్చర్యంకలిగింది. కనకాంగి తనవృత్తి నిక్కడకూడా మొదలుపెట్టినట్టుంది.

"అదిగో, అమ్మాయి పంకజం" అంది సత్యనారాయ ణతో కనకాంగి సిగ్గునభినయిస్తూ.

"పంకజ!...ఈమె...మీాతల్లి...!" అన్నాడు సత్య నారాయణ ఆశ్చర్యం వెలిబుచ్చుతూ.

పంకజ కెందుకో పెద్దగా నవ్వువచ్చేసింది ఆ దృశ్యాన్ని చూాచేటప్పటికి. పొట్టచెక్కలయ్యేటట్టు నవ్వుతూ అక్కడే కుర్చీలో కూలబడిపోయింది. కాస్సేపు పిడుగుపెట్టినట్టు అట్లాగే చూస్తూ కూర్చుంది. ఆమెలో యెలాంటిచలనమూ లేదు. అదేమీాఅర్థంకాక వింతగాచూస్తున్నాడు భాస్కరం. అతడు సత్యనారాయణవంక నిదానించిచూాచాడు "మిమ్మల్ని తరుచు లాకాలేజిలో చూాచినజ్ఞాపకం ?" అన్నాడు.

"అవును. నేను లాకాలేజిలో చదువుతున్నాను" అన్నాడు సత్యనారాయణ.

"ఒకసారి నాతో వస్తారా?" అన్నాడు. ఇద్దరూ కలసి బయటికి వెళ్ళారు. పంకజ యింకా యథార్థస్థితిలోకి రాలేదు. కనకాంగి తనసోది మొదలుపెట్టింది.

"నేనేంచేయను? వాడెవడో బీచిలో సాయంకాలం నించీ నావెంటపడ్డాడు. నే నెంతతప్పించుకురావడానికి ప్రయత్నించినా అతగాడు వదిలితేనా. అప్పటికీ నే నట్లాటిదాన్ని కాదండీ అని యెంతో చెప్పాను. ససేమిరా అతడు వినిపించుకుంటేనా...!" అంది.

పంకజ మళ్ళీ ఈలోకానికివచ్చింది. ఆమెను వివిధఆలోచనలు చుట్టుముట్టినై. కనకాంగిని యింక వొక్కక్షణం వుంచుకోడానికిష్టపడ్లేదు. ఆమెను తెల్లవారే బయటికి పంపించెయ్యాలని నిశ్చయించుకున్నది. కాని ఆమె వెళ్ళేదెట్లా? గురుప్రసాదు తనకిచ్చిన అయిదువందలూ అట్లాగే వున్నవి. ఆపైకం కనకాంగికిస్తే, ఆమె చక్కాపోతుంది. కనకాంగిధనాశ ఆమెకు తెలుసు. రాత్రంతా అదే ఆలోచించింది. పొద్దున్నే అయిదువందలూ కనకాంగిచేతిలోపెట్టి "ఇంక నాయింట్లో వొక్కక్షణం వుండవద్దు వెళ్లు" అని కనకాంగిని పెట్టెతోసహా తీసుకొచ్చి బయట నిలబెట్టింది.

"నన్ను యింట్లోనుంచి వెళ్ళగొడుతున్నావుగదూ. సరే, సరే-నీవుమాత్రం బాగుపడతావటలే. నావుసురు తగులుతుంది నీకు" అని అరుస్తూ వెళ్లిపోయింది.

కనకాంగి వెళ్లిపోయాక పంకజ లోపలికివచ్చి కుర్చీలో కూలి, వెక్కివెక్కి యేడ్చింది. యెందుకో అట్లాయేడుస్తే తన గుండె తేలికపడుతుందనిపించిం దామెకు.

భాస్కరం యింతవరకూ రాలేదు. ఇంక రాడని నిశ్చ యించుకుంది. సత్యనారాయణ తనసంగతంతా భాస్కరానికి చెప్పేసివుంటాడు. ఒకవితంతువునైనా నిర్భయంగా చేపట్ట గలరు. కాని యెంత వుదారహృదయులైతేమాత్రం వేశ్య కూతుర్ని వివాహం చేసుకుంటారా?" అని ఆమె ఆలోచిస్తోంది.

సుమారు యెనిమిదిగంటలకు భాస్కరం వచ్చాడు. పంకజకు మళ్లీ దుఃఖం గట్లుతెంచుకు వచ్చేసింది. ముఖాన్ని చేతులతో కప్పుకుంది. భాస్కరం ఆమెతల నిమిరాడు. "సత్య నారాయణ నీ సంగతంతా చెప్పాడు. అది విన్నాక, నిన్నే చేసుకోవాలన్న నాసంకల్పం మరీధృఢమైంది-లే, భయపడకు. ఇంక నీకు శ్యామలాంబ తల్లి, సత్యనారాయణ అన్న. వచ్చే ఆదివారమే మనపెళ్లి" అన్నాడు. పంకజ భాస్కరంకాళ్ళను గట్టిగా కౌగలించుకుంది. "మీరు నన్ను నిజంగా పెళ్లాడు తారా?" అంది.

"నీ కా సందేహం యెందుకు వచ్చిందిప్పుడు? నేను నిన్నుతప్ప మరో కన్యను చేపట్టననలా" అన్నాడు భాస్కరం నవ్వుతూ. పంకజ విధిబలీయమైనది అనుకుంది తనలో.

## 15

"కడలిచెలియలి కట్ట తెగితె.
మనసులోకపుకట్ట తెగితె" శ్రీ విశ్వనాథవారి
చెలియలికట్ట.

గురువారంనాడు సాయంకాలం మద్రాసువదలిన కల కత్తామెయిలు మధ్యలో ఒంగోలువద్ద జరిగిన 'గూడ్సు

ప్రవహాదంవల్ల శుక్రవారంనాడు దీపాలుపెట్టే వేళగాని రాజ మంత్రి చేరుకోలేదు. భాస్కరం సత్యనారాయణనుకూడా వెంటతీసుకువచ్చాడు తమతోపాటే. శ్యామలాంబకు పెండ్లి పిలుపు కలకత్తాకు అందింది. ఆమె భారతితోపాటు పెళ్ళినాటికి అక్కడికే వస్తానని తిరిగి కబురు పంపింది. ఆమెభర్త రాఘు వయ్యగారుకూడా పెళ్ళినాటికి వస్తానని చెప్పాడు భాస్కరంతో.

కాబోయే వధూవరులైన పంకజాభాస్కరులను స్టేషన్ నుంచి తీసుకువెళ్ళడానికి భాస్కరం స్నేహితులూ, బంధు వులూ పూలహారాలతో వచ్చారు. పంకజంఅందం అందరినీ ఆకర్షించి ముగ్ధులనుగావించింది. అంత అందమైన భార్యను యెన్నుకున్న భాస్కరం అదృష్టాన్ని అభినందించకుండా వుండ లేకపోయారు అందరూ. పూలహారాలతో అలంకరించిన మోటారుకారులో పంకజము, భాస్కరాన్ని పెళ్ళికిముందు విస్తారంగా తోచినా, వూరేగింపుగా యింటికి తీసుకెళ్ళారు. భాస్కరం దారిలో పంకజతో తన స్నేహితులనుగురించీ బంధువులనుగురించీ గుసగుసగా యేమేమో చెబుతున్నాడు.

కారుదిగగానే భాస్కరంచెల్లెళ్లు యిద్దరూ భాస్క రాన్ని, పంకజను గడపముందు హారతియిచ్చి, కొబ్బరికాయ కొట్టి మరీ లోపలకితీసుకెళ్ళారు. ఇల్లంతా దీపాలతో కళకళ లాడిపోతున్నది. పంకజరాక ఆయింటి కో కొత్తవెలుగు నిచ్చింది. పంకజనుచూచి అమ్మలక్కలందరూ ముచ్చట పడ్డారు. నట్టింట లక్ష్మి వెలసిందన్నారు. భాస్కరంచేసుకున్న పుణ్యాన్ని పొగడారు.

"నాన్న యేరీ?" అని అడిగాడు భాస్కరం పెద్ద చెల్లెల్ని.

"పెద్ద తయ్యనుతీసుకురావడానికి పెంటపాడు వెళ్ళారు. రాత్రితొమ్మిదింటికి వస్తారు" అంది చెల్లెలు.

"పద, అమ్మను చూద్దాం" అంటూ పంకజను తల్లి దగ్గరకు తీసుకువెళ్ళాడు భాస్కరం. భాస్కరంతల్లి పక్షవాతంతో మంచంపట్టివుంది.

"మాఅమ్మ పక్షవాతంతో తీసుకుంటోంది. అందుకనే పెళ్ళి యిక్కడే యేర్పాటుచేయవలసివచ్చింది" అన్నాడు పంకజతో.

"వొదిన యెల్లావుందమ్మా...?" అని అడిగింది భాస్కరంచెల్లెలు. ఆమెకు మాటలుకూడా పడిపోయినై. ఆనందాశ్రువులురాలుస్తూ ఆశీర్వాదసూచకంగా తలపంకించింది. అందరూ బయటకువచ్చేశారు.

ఇల్లంతా వొక్కటేసందడిగా వుంది. మనిషి, తిరుగు తోంచేగాని, యింతసేపూ పంకజమనసు మనసులోలేదు. ఆమెకు తను కనకాంగికూతురన్న సంగతి జ్ఞాపకంవచ్చేసింది. ఆ కులీనకుటుంబంలో తాను కోడలిగా వుండడానికి తగనని ఆమెఅంతరాత్మ బోధిస్తున్నది. తానెవరో, తనకులం యేదో చెప్పకుండా యింతమందినీ తాను మోసగిస్తున్నట్టు తోచింది దామెకు. రేపు నిజం బయటపడితే, తనగతేమిటి? ఈ నిండు కుటుంబంయొక్క పరువుప్రతిష్ట లేమవుతాయి? తనేదో నాటక మాడుతున్నట్టు తోచిం దామెకు. తనపవిత్రత కేవలం సినిమా

పాత్రివత్యంలా వుందనిపించింది. ఆ యింట్లో యెవరిముందూ తాను నిలవలేకపోతోంది.

స్నానాలగదిదగ్గర వొంటరిగా తారసిల్లిన భాస్కరాన్ని అడిగింది "ఎందుకీ నాటకం ?"

"నేను నిన్నుతప్ప మరొకళ్నెను చేపట్టలేను. నిన్ను పెళ్ళాడడానికి యెంతనాటకమైనా ఆడుతాను" అంటూ వెళ్ళి పోయాడు భాస్కరం.

పంకజగుండె క్షణక్షణం వేగంగా కొట్టుకోనారంభించింది. నలుగురిలో తిరగడానికి ఆమెకు ధైర్యంచాలడంలేక, వెళ్ళి ధాన్యపుకొట్టుదగ్గర చీకట్లో కూచుంది. చాలసేపటికి భాస్కరం ఆమెను వెతుక్కుంటూ వచ్చాడు.

"ఇక్కడ కూర్చున్నావా! పద, నాన్నగారు వచ్చారు. నిన్ను చూడాలంటున్నారు" అన్నాడు ఆమె చెయ్యిపట్టుకుని యివతలకి లాగుతూ.

"వద్దు, నా కెందుకో భయంవేస్తున్నది" అన్నది పంకజ.

"నీ కేమీ భయంఅక్కరలేదు. పద, అసలు మా అమ్మ నాపెళ్ళిచూడాలని యిక్కడకు నిన్ను తీసుకురావలసి వచ్చింది. లేకపోతే యీమాత్రంకష్టంకూడా నీకు కలిగించి వుండను" అన్నాడు. ఇంక ఆమెజవాబుకోసం అతను యెదురు చూడలేదు. ఆమెచెయ్యిపట్టుకుని బయటకు లాక్కెళ్ళాడు.

హాల్లో భాస్కరంతండ్రితోపాటు ఇంటిల్లిపాది వున్నారు పంకజకోసం యెదురుచూస్తూ.

"ఇదుగో నాన్నా వదిన" అంది భాస్కరంచెల్లెలు.

పంకజ మెల్లిగా తలయెత్తి చూచింది భాస్కరంతండ్రి

కేసి. ఆమె తలమీద వెయ్యిపిడుగులు ఒక్కసారిగా పడ్డట్టయింది. ముఖం వివర్ణమైంది. ఆమె నిర్వీణ్ణ అయింది. భాస్కరం తండ్రా ? ఎవ రీయన?"

"ఎంత చెడ్డా మా సానికులానికీ ఒక నీతంటూ వుండదం డోయ్ ! మీ రక్తం పంచుకుని నాకడుపునపుట్టింది...... సాక్షాత్తు నీతండ్రే' అని కనకాంగి తనకళ్లెదుట నిలబడి అరుస్తున్నట్టనిపించింది.

ఆమెకు కాళ్ళకింద నేల ఎక్కడికో జారిపోతున్నట్టనిపించింది. భూగోళం గిరగిరా తిరిగిపోతున్నట్టుంది. కాస్సేపటికి పంకజకు చైతన్యం కలిగింది.

"కడలి చెలియలికట్ట తెగితే...

"మనసులోకపుకట్ట తెగితే..."

"ఏమౌతుంది? ఏమౌతుంది?"

గ్రహగోళాలన్నీ ఒకదానితో ఒకటి ఢీకొని ముక్కముక్కలైపోతాయా? సృష్టికి మకుటమైన మానవజాతి నామరూపాల్లేకుండా మాసిపోతుందా?

సృష్టివిధానాన్నే, లోకధర్మాన్నే ఎదిరించి నిలిచింది ఒక్కక్షణం ఆమెకళ్లోలమనఃస్థితి. ఎందుకో రక్తసంబంధం అనేటప్పటికి మనస్సు వెనక్కులాగుతుంది. అవ్యక్తంగా ఆమె అంతరాత్మకు ఎవరో బోధిస్తున్నారు.

పంకజ భాస్కరంతండ్రి కేసి—కాదు తనతండ్రి కేసిచూస్తూ అలాగే నిలబడింది. అతనుకూడా పంకజ కేసి చూస్తూ అలాగే స్థాణువులా చూస్తున్నాడు.

"వొదిన ఎల్లావుంది నాన్నా?" అని అడిగింది భాస్కరం చిన్న చెల్లెలు.

"బాగుంది, బాగుంది..." అన్నాడతడు ఎల్లాగో.

ఆ మాటల్లో బాధ అతనికే తెలుసు. అతనిమనసులో బాధ పంకజకే తెలుసు. కాని భాస్కరం పొంగిపోతున్నాడు. లోపలినించి భోజనాలకు పిలుపువచ్చింది.

"మీరు తినండి, నా కాకలిలేదు..." అంటూ వెళ్ళిపోయాడు భాస్కరంతండ్రి

"కోడల్ని చూచేటప్పటికి మామగారికి కడుపునిండిపోయినట్టుంది" అన్నాడు సత్యనారాయణ. అందరూ పెద్దగా నవ్వారు. పంకజకు సూదులతోపొడుస్తున్నట్టుంది. "నాకూ భోజనంవద్దు" అన్నది.

"మామగారిని చూచేటప్పటికి కోడలికూ కూడా కడుపు నిండిపోయినట్టుంది" అన్నది భాస్కరంచిన్న చెల్లెలు. అందరూ మళ్ళీ నవ్వారు.

పంకజచేత బలవంతంగా అన్నంతినిపించారు.

రాత్రి ఆడవాళ్ళంతా ఒకచోట చేరింది పడుకోడానికి. పంకజకూడా అక్కడే పడుకోవలసివచ్చింది. అందరూ చాలాసేపటివరకు మాట్లాడుతూ నిద్రపోయారు. పంకజ మాత్రం గాఢాంధకారంలోకి చూస్తోంది.

వైకుంఠపాళిఆటలో పావును మళ్ళీ పెద్దపాము మింగింది. పావు మొదటిగడికి—కోతిజన్మకు వచ్చింది. సరిగ్గా పంకజస్థితి కూడా అంతేఅయింది.

అతడు భాస్కరుడు, తాను పంకజ. ఆమె పంకజా భాస్కరుల అనాదిబాంధవ్యరహస్యాన్ని గురించి ఆలోచిస్తోంది.

తననుతప్ప మరొకకన్యను చేపట్టనన్న భాస్కరం, తమ యిద్దరిమధ్య యీకొత్తసంబంధాన్ని—కాదు పాతసంబంధాన్ని తెలుసుకుంటే యేంజేస్తాడు? యెందుకో తనమీదే తనకు అసహ్యంకలిగింది. "నీవుమాత్రం బాగుపడవు, నా వుసురులగులుతుందిలే" అని శాపంపెట్టేసట్టు కనకాంగి తనకళ్లెదుట అరుస్తూండడం కనుపించిందామెకు. నిజమే, తాను యేవిధంగానూ బాగుపడలేదు. యింక తాను బ్రతకడం దేనికి? తనకు వివాహం కాదు. రేపు జరిగేది అవమానమే. యెవగూ మేలుకోనకముందే తా నీ లోకాన్ని విడచిపెట్టడం అందరికీ క్షేమం. తన మరణానికి సాక్ష్యేదెవరు? పంకజ చావడానికే నిశ్చయించుకున్నది. ఒకనాడు తాను ఘోరపాపమని విరమించుకున్న ఆత్మహత్యకే యిప్పుడు మళ్లీ సిద్ధపడడానికి నిశ్చయించుకున్నది.

అందరూ బాగా నిద్రపోతూవుండడం చూచి ఆమె మెల్లగా దొడ్లో నూతిదగ్గరికి వెళ్లింది. నక్షత్రాలవెలుగు మసకమసకగావుంది. ఆమె కింకా ఆలోచించడానికి వ్యవధిలేదు. నూతిగట్టుమీద యెక్కింది. రెప్పపాటులో దూకనున్నది. కాని, "ఆఁగు" అంటూ ఆమెభుజాన్ని పట్టి వెనక్కులాగారెవరో. ఆమె కిందికిదిగి, వెనక్కుతిరిగింది. అంత చీకట్లోనూ తండ్రిని పోల్చుకోగలిగింది. ఆయనకూడ నిద్రపట్టక దొడ్లో పచార్లుచేస్తున్నాడు. పంకజరాక కనిపెట్టాడు.

"నిందుయింట్లో యిటువంటిఅఘాయిత్యం చెయ్యకు" అన్నాడు. పంకజ యేమీ మాట్లాడలేకపోయింది.

"పంకజా!" అన్నా డతడు గద్గదికంగా.

పంకజకు దుఃఖం గట్లు తెంచుకునివచ్చింది. ఆయన రొమ్ముమీదవాలిపోయి "నాన్నా, నాన్నా!" అంటూ వెక్కి వెక్కి యేడ్చింది యెందుకో అట్లా యేడవాలనిపించింది. యెన్నాళ్ళకు తన కీ భాగ్యం కలిగింది. అత డామెను తనగుం డెకుహత్తుకున్నా డు. తలనిమిరాడు. అతనికి దుఃఖం పొంగి వచ్చింది.

"నీవు నాకూతురువని కనకాంగి ఆనాడు చెప్పకుండా వుండివుంటే, నిన్ను కళ్ళకద్దుకుని నా కోడలిగాచేసుకొనివుం దును. కాని, రక్తసంబంధం అంటే మనస్సు వెనక్కిలాగు తోంది" అన్నా డు. పంకజ యింకా యేడుస్తూనేవుంది.

"అమ్మాయ్! నీవు నాకు చీకట్లోపుట్టినబిడ్డవు. మన ఈ బాంధవ్యం యెవరికీ తెలియకూడదు. ఈవూళ్ళో నా పరువు ప్రతిష్టలకు భంగంరానీయకు" అన్నా డు.

"నా కీ ప్రపంచంలో పరువుప్రతిష్టలు యెల్లాగూ లేవు. మీ గౌరవాన్ని కూడా యెందుకుపాడుచేస్తాను? నే నెక్కడి కైనా వెళ్ళిపోతాను."

"ఇప్పుడు కాదు, రేపుపుదయాన్నే వెళ్ళు".

"నన్నుతప్ప మరొకకన్యను చేపట్టనన్న భాస్కరంగతి యేంకావాలి?"

"అవును, అతనికిమాత్రం యీసంగతి చెప్పకతప్పదు."

"నేను హఠాత్తుగా వెళ్ళిపోతే లోకం యేమను కుంటుంది?"

"వారికి నే నేదో సర్ది చెబుతాను. నీవు వెళ్ళి పడుకో"

పంకజ లోపలికి వచ్చేసింది. కన్నీరు ఆగడంలేదు పొంగివచ్చే దుఃఖాన్ని అణుచుకుంటోంది. తా నాయనకి చీకట్లోపుట్టినబిడ్డ. ఆయనకి పరువు వుంది, ప్రతిష్ట వుంది. తన కేముంది? అంతా చీకటి, అంతా చీకటి! ఆమె యేడుస్తూనే పడుకుంది.

తెల్లవారినా యింకా బాగా వెలుతురు రాలేదు. భాస్కరం డాబామీద నిలబడి పళ్లు తోముకుంటున్నాడు. మగవారంతా రాత్రి మిద్దెమీదే పడుకున్నారు. సత్యనారాయణ యింకా నిద్రలేవలేదు. భాస్కరం బయట జట్కానిల బడి వుండడం చూచాడు. జట్కావాడు పంకజపెట్టె జట్కాలో పెడుతున్నాడు. అతని కేమీ అర్థంకాలేదు. వొక్క పరుగున కిందికివచ్చాడు.

పంకజ తండ్రిపాదాలకు నమస్కరించింది. "ఇంక నేను వెడుతాను. భాస్కరానికి యేదో నచ్చచెప్పండి" అంది. కన్నీళ్ళు తుడుచుకుంటూ. కిందకూడా యింకా యెవ్వరూ నిద్రలేవలేదు. వొక్క భాస్కరం పెద్దచెల్లెలుమాత్రం లేచి వచ్చింది. యేమీ అర్థంకాక ఆదృశ్యాన్ని చూస్తోంది. అంతలో భాస్కరం వచ్చాడక్కడికి.

పంకజకు దుఃఖం ఆగలేదు. అతని కేసి చూడలేక పోయింది. ముఖాన్ని చేతులతో కప్పుకుని బండివైపు నడిచింది.

భాస్కరం "పంకజా!" అంటూ ముందుకు వురక బోయాడు. కాని, తండ్రి గట్టిగా అతనిచెయ్యి పట్టుకుని వెనక్కులాగాడు. 'వెళ్ళనివ్వు, ఆమెవెంట నీవు వెళ్ళలేవు"

అన్నాడు. ఆయన భల్లూకంలా పట్టుకున్నాడు. తండ్రిబలం ముందు భాస్కరం బలహీనుడై పోయాడు.

పంకజ వెళ్ళి బండిలో కూర్చుంది. తా నెక్కడికి వెళ్ళడం? ఎక్కడైనావుండి, శ్యామలాంబగారికోసం యెదురు చూడడమా? యేముఖంపెట్టుకుని? నర్మదసగ్గరకు వెళ్ళడమా? యేముఖంతో? కనకాంగిపద్దకి? ఆ నరకంలోనికా...?

"నీక్షుమాత్రం బాగుపడవు. నా వుసురు తగులుతుందిలే నీకు" అని శాపంపెట్టేస్తూ అరుస్తున్న కనకాంగి ఆమె కళ్ళెదుట కనుపించినట్లయింది.

"యెక్కడికి పోనివ్వాలనమ్మా బండి...?" అనడిగాడు బండివాడు.

పంకజకు నవ్వొచ్చింది. "పోనివ్వు, రైలుచక్రాల కిందికి, గిరగిరతిరిగే భూగోళం అవతలకి" అంది. పంకజ అన్న యిన్నిమాటల్లోనూ ఒక్క రైలు అన్నమాటమాత్రమే బండి వాడికి వినపడింది. గుర్రాన్ని అదలించాడు. గిరగిరమంటూ బండి వెడుతోంది. ఆ ధ్వనిచేస్తున్నది ఆ శకటచక్ర భ్రమణమో! ధూమశకటచక్రభ్రమణమో! అల్లకల్లోలమైన సముద్ర తరంగాలతో తిరుగుతూన్న పృథ్వీచక్రభ్రమణమో!

పంకజకు అంతా అయోమయం.

*